# అవధాన చక్రవర్తి
# శ్రీ మేడసాని మోహన్ చౌదరి
# శతావధాన సంచిక




PULICHERLA

శ్రీనాథ సాహితి

ఆగష్టు

1987

శ్రీనాథ సాహితి

జూన్ 1987

అవధాన చక్రవర్తి శ్రీ మేడసాని మోహన్

# శతావధాన సంచిక

సంపాదకుడు :

డాక్టర్ ప్రసాదరాయకులపతి

-: ప్రచురణ :-

ఆహ్వాన సంఘము

శ్రీనాథపీఠము

గుంటూరు.

# శ్రీనాథ పీఠ కార్యవర్గము

(పుష్పోత్సవాల సమయంలో)

అధ్యక్షురాలు :

**ఛాయా రతన్, I. A. S.**

కలెక్టరు, జిల్లా మేజిస్ట్రేటు

లు :

**M. నాగార్జున, I. A. S.**

జాయింట్ కలెక్టరు

**K. సుందరరావు**

జిల్లా రెవిన్యూ అధికారి

**C. R. నాయుడు**

**Addl. S. P.**

నిర్వహణాధ్యక్షుడు :

**డా॥ ప్రసాదరాయ కులపతి**

కార్యదర్శి :

**P. S. దత్తప్రసాద్**

# పుష్పోత్సవ ఆహ్వాన సంఘంవారు

డా॥ కె. బసవపున్నయ్య

ఉపాధ్యక్షుడు :

బొల్లేపల్లి సత్యనారాయణ

కార్యదర్శి :

యమ్. హనుమంతరావు

పాలడుగు లక్ష్మణరావు

పోషకులు :

అమరావతి ఛారిటబుల్ ట్రస్టు

L. V. R. & SONS CLUB

గుంటూరు

# వదాన్య శేఖరులు

'అవధాన చక్రవర్తి' శ్రీ మేడసాని మోహనచౌదరి శతావధాన సభ అర్ధశతాబ్దము తరువాత గుంటూరు నగరములో జరిగిన సభ. ఈ శతావధాన సభను, శ్రీ మేడసాని సన్మానసభనునిర్వహించుటకు ఎందరో దాతలు సహకరించినారు. యల్. వి. ఆర్. అండ్ సన్స్ క్లబ్ & రీడింగ్ రూమ్, అమరావతి ఛారిటబుల్ ట్రస్టు సంస్థలు ప్రత్యేకస్తుతికి పాత్రములు. వదాన్య శేఖరులు శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారు ఒక వ్యక్తిగా గాక సమూహశక్తిగా సహకరించినవారు. ఇంకను ఈ సభా విజయమునకు ఆర్థికముగా సహకరించినవారు పలువు రున్నారు. వారి సహాయమునకు పేరు పేరున కృతజ్ఞతలు తెలుపుట కర్తవ్యము.

1. యల్. వి. ఆర్. & సన్స్ క్లబ్ & రీడింగు రూమ్
2. అమరావతి ఛారిటబుల్ ట్రస్టు
3. శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ
4. శ్రీ అబ్బూరి సుబ్బారావు
5. డాక్టర్ కొండబోలు బసవపున్నయ్య
6. విద్వాన్ శ్రీ గోగినేని కనకయ్య
7. డాక్టర్ వి. రంగారావు
8. శ్రీ పి. లక్ష్మణరావు (బ్రహ్మయ్య & కంపెనీ)
9. శ్రీ ఆర్. అంకమ్మ
10. డాక్టర్ జి. వేంకటేశ్వరరావు
11. డాక్టర్ యు. వి. సుబ్బారావు (పద్మావతీ నర్సింగ్ హోం)
12. శ్రీ డి. నరసింహారావు (డి. నరసింహారావు & కంపెనీ)
13. డాక్టర్ నూతక్కి వేంకటేశ్వరరావు
14. శ్రీ మేడా మహేంద్ర
15. శ్రీ కొమ్మారెడ్డి రాంబాబు (శ్రీ వేంకటేశ్వర పౌల్ట్రీ ఫామ్)
16. శ్రీ యన్. అంజయ్యనాయుడు (నాగార్జున ఎంటర్‌ప్రైజెస్, పల్లవీ థియేటర్)
17. శ్రీ బి. సూర్యనారాయణ
18. శ్రీ కోగంటి వేంకటేశ్వరరావు (ఆడిటర్)

19. డాక్టర్ ముద్దన హనుమంతరావు
20. శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి
21. శ్రీ వై. చిరంజీవి (చౌదరి ఏజన్సీస్)
22. శ్రీ జి. రామారాయుడు
23. శ్రీ వలివేటి నరసింహారావు
24. శ్రీ బాబూరావు (అలైడ్ మార్కెటింగ్ ఏజన్సీస్)
25. శ్రీ బిహెచ్. సీతారామరాజు
26. డాక్టర్ యం. గోపాలకృష్ణ
27. శ్రీ పి. నాగేశ్వరరావు (ఆడిటర్)
28. శ్రీ చేబ్రోలు గాంధీచౌదరి (తండ్రి హనుమయ్య)
29. శ్రీ తిరుమల కాటన్ ట్రేడర్స్
30. శ్రీ ఆర్. హనుమంతరావు (జయలక్ష్మి టుబాకో కంపెనీ)
31. శ్రీ వై. యన్. యస్. ప్రసాద్ (ఈస్ట్ ఇండియా టుబాకో కంపెనీ)
32. శ్రీ చలువాది తిరుపతిరావు & కంపెనీ, తెనాలి
33. శ్రీ బొబ్బ సత్యనారాయణ (శ్రీ గణేష్ స్టోన్ క్రషర్స్)
34. శ్రీ వెంకటరత్నం (ధనలక్ష్మి కాటన్ & రైస్ మిల్, చిలకలూరిపేట)
35. డాక్టర్ సి. శోభనాద్రి
36. శ్రీ బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తి (బొమ్మిడాల బ్రదర్స్ లిమిటెడ్)
37. డాక్టర్ జి. యతిరాజులు
38. గోరంట్ల పున్నయ్య, (బొగ్గవరపు రామయ్య ఛారిటబుల్ ట్రస్ట్)
39. శ్రీ గీతా రెస్టారెంట్ (సుదర్శన్ హోటల్)
40. ది టౌన్ హోటల్ ప్రొప్రయిటర్స్ అసోసియేషన్
41. శ్రీ పెంటాల పరంధామయ్య
42. ఆలూరి కోటయ్య & కంపెనీ
43. శ్రీ మాదాల రాజేంద్రప్రసాద్
44. శ్రీ బండ్లమూడి సుబ్బయ్య
45. డాక్టర్ సి. నాగేశ్వరరావు

# సంపాదకీయం

గుంటూరు నగరం రాజకీయంగా ఎంత చైతన్యవంతమైనదో సాహిత్యపరంగా అంతకంటె ఎక్కువగానే చైతన్య సమన్వితమైనది. కవి బ్రహ్మ తిక్కనకు సాహితీ క్రీడలను నేర్పినదీనేల. కొండవీటి సామ్రాజ్య విద్యాధికారి శ్రీనాథుని కవితావిలాసాలకు నోచుకున్నదీసీమ. మాడభూషి వేంకటాచార్యులవారి శతావధాన విస్ఫూర్తితో వికసించిన దిక్కడి వాతావరణం. తిరుపతి వేంకటకవులు, కొప్పరపు సోదరకవులు కవితాయుద్ధం ప్రారంభించినదిక్కడే. త్రిపురనేని, ఏటుకూరి, జాషువావంటి కవివర్యులు, ఆస్థానకవిగా అలరిన కాశీ కృష్ణాచార్యులవారు, పండితశేఖరులు పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్యులవారు ఈ మండలానికి ఖ్యాతిని తెచ్చారు. నాటిమేటి కవి పండితులతోపాటు అభినవ తిక్కన తుమ్మలవారు, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, ఆలంకారిక శిరోమణి జమ్ములమడక మాధవరామ శర్మగారు మొదలైన ఎందరో కవిపండితులకు నెలవీసీమ.

ముఖ్యంగా అవధానాశుకవితారంగంలో చండప్రచండులై ప్రవేశించిన కొప్పరపు సోదరకవుల తర్వాత ఒక్క వేలూరి శివరామ శాస్త్రి గారు మాత్రం గుంటూరులో శతావధానం చేశారు. ఆ తర్వాత గత యాభైయేండ్లుగా ఎన్నో అష్టావధానాలు జరిగినవిగాని శతావధానాలు జరగలేదు.

తిరుపతినివాసి-యువకుడు శ్రీ మేడసాని మోహన్ అవధానరంగంలో మార్తాండునివలె ప్రకాశిస్తున్నాడని నాకు తెలుసు. గుంటూరులో అతని అష్టావధానాలు ఏర్పాటు చేశాము. విజయవాడలో రసభారతి సంస్థ ఏర్పాటుచేసిన శతావధానాన్ని నేనే నిర్వహించాను. గుంటూరులో కూడ త్వరలో ఏర్పాటు చేస్తామని శ్రీ మోహన్ సన్మాన సభలో ఆనాడు ప్రకటించాము. దానికి అనుగుణంగా గర్తపురి ప్రముఖుల సహకారం లభించింది. ఆ విశేషాలు ఆహ్వాన సంఘాధ్యక్షులు డా॥ బసవపున్నయ్యగారి ప్రసంగవ్యాసంలో చూడవచ్చు.

27-6-86 నుండి 29-6-86 వరకు మూడురోజుల శతావధానం పెద్దపండుగలాగా జరిగింది. గుంటూరు నగరం నగరమే కదిలివచ్చిందా

అన్నింతటి ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని దర్శించగలిగాము. తండోప తండాలుగా ప్రజలు వచ్చారు. శ్రీ వెంకటేశ్వర విజ్ఞానమందిరం లోపలి ఏర్పాట్లు చాలక బయట వీడియో ఏర్పాటు చేయవలసి వచ్చింది. అక్కడా చేరి చూచారు ఎందరో! ఎందరెందరో!

ఈ 29 ఏండ్ల యువకుడు శతావధానం ఎలా చేస్తాడన్న ఉత్కంఠ- 50 ఏండ్ల తర్వాత మన నగరంలో జరుగుతున్న అద్భుతదృశ్యం పోగొట్టుకో గూడదన్న ఆకాంక్ష ప్రేక్షకులలో కనిపించింది. అందులో హేమా హేమీలైన పృచ్ఛకులు-రాష్ట్ర రాష్ట్రాంతరాలనుండి వచ్చినవారు ప్రశ్నలు వేస్తుంటే, శ్రీ మోహన్ సమాధానపద్యాలు పలుకుతుంటే అదిచూచి తీరవల సిన దృశ్యం. విజయవంతంగా శతావధానం జరిగినప్పుడు పృచ్ఛకులు, సదస్యులు పొందిన సంతోషము, సంతృప్తి వర్ణనాతీతం.

మూడవ రోజు సన్మానసభ ఇంద్రసభను తలపించింది. శ్రీయుతులు జమ్ములమడక మాధవరామశర్మ, పి. వి. ఆర్. కె. ప్రసాద్ ప్రభృతుల ఆశీస్సులతో ప్రారంభమై విజయశ్రీ విలసితమైన సత్కార సదస్సుకు విచ్చేశారు మహా పండితులు-కవి శేఖరులు, వివిధారంగ ప్రముఖులు. తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తి, కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి, అధికారభాషా సంఘ అధ్యక్షులు డా॥ కె. వీరభద్రరావు, సాహితీ వల్లభ కె. వి. శివయ్య. యామిజాల పద్మనాభస్వామి, కొసరాజు రాఘ వయ్య ప్రభృతులు శ్రీ మోహన్‌ను మనసారా ఆశీర్వదించారు- శ్రీయుత చేబ్రోలు హనుమయ్య, జాగర్లమూడి చంద్రమౌళి, సకుర్తి రామయ్య మొదలైన పురప్రముఖులు హృదయపూర్వకంగా అభినందించారు. ఒక సరస్వతీ పుత్రునికి, ఒక అవధాన విద్యావిభునకు జరిగిన అపూర్వ సన్మాన మది. 29 ఏండ్లవయస్సుగల యువకవి శ్రీ మోహన్‌కు చంద్రునికొక నూలుపోగువలె నూతన వస్త్రాలతో 29000 రూపాయల నగదు ఇచ్చి గౌరవించింది ఆహ్వానసంఘం. పృచ్ఛకులుగా విచ్చేసిన విద్వాంసులను, సన్మానాది సభలలో పాల్గొన్న కవిపండితులను యథాశక్తి సత్కరించటం జరిగింది. ఈ మూడురోజులు కవిపండితులను, అతిథులను ఇష్టమృష్టాన్న సంతృప్తులను చేసిన శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారి ఆతిథ్యమర్యాదలు అందరినీ హర్షపులకితులను చేసినవి.

సన్మాన సభలో పాల్గొన్న పెద్దలు శతావధానం మొత్తం ఒక సంచికగా అచ్చు వేయాలని సూచించారు. అప్పుడే దానికి అంగీకారం ప్రకటించారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. అయితే అనివార్యకారణాలవల్ల కొంత ఆలస్యం జరిగింది.

ఇంతలో తిక్కన ఉత్సవాలు - అభినవ తిక్కన, తెనుగులెంక శ్రీ తుమ్మలవారికి సన్మానం - మళ్ళీ అంతటి పెద్ద కార్యక్రమం తలపెట్ట టము-ఇటువంటి పనులతో శతావధాన సంచిక ముద్రణ తొందరగా చేయలేక పోయినాము. ఈ సంచిక పూర్తి అయ్యే సమయానికి శ్రీనాథ పీఠ అధ్యక్షులుగా శ్రీమతి ఛాయారతన్‌గారి స్థానంలో శ్రీ ప్రసన్నకుమార్ మహంతి - (కలెక్టరు), సహాధ్యక్షులుగా శ్రీ యం. నాగార్జునగారి స్థానం లో శ్రీ రాజేంద్ర మోహన్ గోసెలగారు (జాయింట్ కలెక్టరు) బాధ్యతలు స్వీకరించటం జరిగింది.

మూడురోజుల శతావధానం తర్వాత పుష్పోత్సవాలలో భాగంగా నాల్గవరోజు ఇంద్రసభ, ఐదవరోజు భువన విజయం అనుపమాన సారస్వత వైభవంతో జరిగినవి. తెలుగుసాహిత్యంలోని జనాకర్షకమైన ప్రదర్శన సాహితీరూపకం. ప్రజ్ఞావంతులైన పాత్రధారులతో సాహిత్య సంగీత సౌందర్య దర్శనంగా జరిగిన ఈ సభలలో మహేంద్రునిగా శ్రీ సి. ఆర్. నాయుడు (ఎడిషనల్ యస్. పి.) కృష్ణరాయలుగా శ్రీ ఆవుల చెంగప్ప (కలెక్టరు) పాల్గొని ప్రాభవోపేతం చేశారు.

ఈ అయిదురోజుల కార్యక్రమాలలో పాల్గొన్న కవి పండితులకు, శ్రమకోర్చి సుదూరంనుంచి విచ్చేసిన మాన్యులకు మా కృతజ్ఞతాంజలి. ఈ సభలు జయప్రదంగా జరగటానికి అనన్యదీక్షతో కృషిచేసిన ఆహ్వాన సంఘ ప్రధానులకు అభివందనాలు చెప్పటమంటే మమ్ము మేమే పొగడు కోవటంవంటిది. కనుక ఆపనిచేయను. ఈ సర్వ కార్యక్రమ విజయానికి మూల కారణమైన ప్రజాభిమానానికి మా శతసహస్ర నమస్సుమనస్సులు సమర్పిస్తూ ఈ సంచికను సహృదయుల కందిస్తున్నాను.

# స్వాగతోపన్యాసము

డా. కె. బసవపున్నయ్య
ఆహ్వాన సంఘాధ్యక్షులు

సభాధ్యక్షులు గౌరవనీయులు శ్రీ చేబ్రోలు హనుమయ్యగారికి, సభా ప్రారంభకులుగా విచ్చేసిన పునరావాస శాఖ కమీషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌గారికి, ముఖ్యఅతిథిగా విచ్చేసిన జానపద కవిసార్వభౌమ కొసరాజు రాఘవయ్య చౌదరిగారికి, మహాపండితులు శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారికి, శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు ప్రసిద్ధ కవి వర్యులు శ్రీ ప్రసాదరాయ కులపతిగారికి, నగర చరిత్రలో యాభై ఏండ్ల తరువాత అద్భుత చరిత్ర సృష్టించబోతున్న అవధాన చక్రవర్తి శ్రీమేడ సాని మోహన్ చౌదరిగారికి పృచ్ఛకులుగా విచ్చేసిన పండితులకు, సభా సదులకు, పురప్రముఖులకు నా స్వాగతాంజలి.

గుంటూరు నగరం రాజకీయంగా ఎంత చైతన్య వంతమైనదో సాంస్కృతిక సాహిత్య పరంగా అంతకంటే ఇంకా ఎక్కువ చైతన్యవంత మైనదనే విషయం మీ అందరకూ తెలుసు. తిక్కన, శ్రీనాథుల వంటి ప్రాచీన మహాకవులేకాక మొన్న మొన్నటి విద్వత్కవిశేఖరులు కొప్పరపు సోదర కవులు, మాడభూషి వేంకటాచార్యులుగారు, రాయప్రోలు సుబ్బా రావుగారు, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, ఏటుకూరి వెంకట నరసయ్యగారు, గుర్రం జాషువా మొదలగువారు; ఈనాటి తుమ్మల సీతారామ మూర్తిగారు, జమ్ములమడక మాధవరామశర్మగారు, కరుణశ్రీ వంటి కవి పండిత ప్రకాండులు ఇక్కడి వారే కావడం విశేషం.

అవధాన మనేది తెలుగువారి ప్రత్యేక విద్య. మాడభూషి వెంకటా చార్యులుగారు, తిరుపతి వేంకట కవులు, వేలూరి శివరామశాస్త్రిగారు, కొప్పరపు సోదర కవులు ఈ ఊరిలో శతావధానాలు చేశారని పండితులు

చెప్పగా విన్నాను. అష్టావధానాలు ఇక్కడ తరుచుగా జరుగుతూ ఉన్నవి. నేనూ కొన్ని చూశాను. కాని గత 50 ఏండ్లుగా ఇక్కడ శతావధానాలు జరగడం వినలేదు. చూడలేదు. ఈ మధ్యనే 29 సంవత్సరాలు నిండీ నిండని యువకుడు, తిరుపతినివాసి శ్రీ మేడసాని మోహన్ అష్టావధానాలు, శతావధానాలు దిగ్విజయంగా చేస్తున్నాడని విని ఆశ్చర్యపడినాను. విజయవాడలో ఇటీవల జరిగిన అతని శతావధానం గురించి, షోడశ గుణిత అష్టావధానం గురించి పత్రికల్లో చదివాను. మిత్రులెందరో చెప్పగా విన్నాను. మా జె. కే. సి. కళాశాలలోనూ, అమరావతి సాంస్కృతిక వేదిక పైన మోహన్ అష్టావధానాలు ఏర్పాటు చేశాం కూడా. డా॥ ప్రసాదరాయ కులపతిగారు, ఇతర మిత్రులు కలిసినప్పుడు మన నగరంలో శతావధానం ఏర్పాటు చెయ్యాలి అన్న ఆలోచనను అప్పుడప్పుడు భావిస్తూ వచ్చాము. ఆ సుహృత్ సమాలోచనల ఫలితమే ఈనాటి ఈ శతావధాన ప్రదర్శన. ఇటువంటి కార్యక్రమాలు ఏర్పాటు చేయడంలో ఎన్నో సాధకబాధకాలు ఉంటాయి. ఎంతో శ్రమతో కూడిన పని. దీన్ని వైభవోపేతంగా చెయ్యా లన్న ఉత్సాహంతో ఇక్కడి పండితులనే కాక దేశం నలుమూలల నుండి పెద్దలను పృచ్ఛకులుగా ఆహ్వానించాలని, మన నగర సారస్వత వైభ వానికి తగినట్లుగా కార్యక్రమాన్ని రూపొందించాలని భావించారు. సాహిత్య రంగంలో సుప్రతిష్ఠమైన శ్రీనాధ పీఠం, దాని నిర్వహణాధ్యక్షులు, దక్షులు శ్రీ ప్రసాదరాయ కులపతిగారు దీనికి తగిన ప్రణాళిక రూపొం దించి ఈ మహత్తర కార్యక్రమ రథసారధియై నిలిచారు. ఈ కార్యక్రమ నిర్వహణకు మిత్రుల మందరం కలిసి ఒక ఆహ్వాన సంఘం ఏర్పాటు చేశాము. డా॥ హనుమంతరావుగారు కార్యదర్శిగా, ఛార్టర్డ్ ఎకౌంటెంట్ శ్రీ లక్ష్మణరావుగారు కోశాధికారిగా; **L. V. R. & Sons Club**, అమరావతి ఛారిటబుల్‌ట్రస్ట్, శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారు-ఈ ముగ్గురూ ప్రధాన పోషకులుగా, నేను అధ్యక్షుడిగా సహృదయ మిత్రులు ఏర్పాటు చేశారు. సాహితీ ప్రియులైన పుర ప్రముఖులు, మా మిత్రులు ఎందరో ఆర్థికంగా, హార్దికంగా, ఉత్సాహంతో, ఉల్లాసంతో చేయూత నిచ్చారు. వారి వారి వివరాలన్నీ తరువాత మనవి చేస్తాను.

ఆంధ్ర దేశపు సాంస్కృతిక రాజధానియైన గుంటూరు నగరంలో ఒక నూతన సువర్ణాధ్యాయాన్ని సృష్టించడానికి, అవధాన చరిత్రలో ఒక క్రొత్త పుట తెరవడానికి కృషిచేసే అవకాశం లభించినందుకు మేము సంతోషిస్తున్నాము. ఒక రకంగా గర్విస్తున్నాము. హృదయ పూర్వకంగా ఆనందోత్సాహాలతో మేము సమర్పిస్తున్న ఈ శతావధాన మహత్తర కార్యక్రమాన్ని సహృదయులు, సాహితీప్రియులు సాదరంగా స్వీకరించాలని, ఇది విజయశ్రీ విలసితం కావడానికి ఇక్కడకు విచ్చేసిన మహామహులు, మహనీయులు, కవి పండితులు ఆశీర్వదించాలని వినయ పూర్వకంగా విజ్ఞప్తి చేస్తూ నా భావనను నివేదిస్తున్నాను.

## అంజలి

డా. కె. బసవపున్నయ్య

ఆహ్వాన సంఘాధ్యక్షులు

పెద్దలకు నమస్కారం.

అయిదు రోజుల పుష్పోత్సవాలు అతి వైభవంగా జరిగిపోయాయి. నగర చరిత్రలో అర్ధ శతాబ్దం తరువాత జరిగిన అద్భుత సంఘటన మొదటి మూడు రోజుల శతావధానం. తిరుపతి వాస్తవ్యుడు, మూడు పదులు కూడా నిండని ముక్కుపచ్చలారని యువకుడు మేడసాని మోహన్ చౌదరి చేసిన అపూర్వ కవితా ప్రదర్శన పట్టణానికి క్రొత్త వెలుగులు తెచ్చింది. తెలుగుదేశంలో నాలుగు మూలలా ఈతని అవధానం చూసిన వారు ఎందరో, "ఈ విద్య కేవలం శ్రమార్జితమే కాదు-సరస్వతీ కటాక్షం" అంటుంటే యిన్నాళ్ళూ విన్నాం. ఈనాడు మనం కూడా చూసి 'ఆమాట నిజమేమో' అని అనుకోకుండా ఉండలేక పోతాం. బహుశా నిష్ఠతో కూడిన శ్రమ శక్తికి ఒక మహత్తర కటాక్షం దానంతట అదే ఆకర్షితమై వరమై పోతుందేమో! విద్య ఉన్న చోట బుద్ధి ఉండదంటారు-కాని ఈ యువకుని లోని సరళత సౌజన్యత-పాండిత్యం మేధస్సుల కలయిక చూస్తే ఈతడు విద్యాబుద్ధుల సమపాళ్ళ మేలు కలయిక అనిపిస్తుంది. మేడసాని మోహన్ చౌదరికి హృదయ పూర్వక అభినందనలు, ఆశీస్సులు.

ప్రజల సహకారము, సాహిత్యాభిమానుల ఆదరము ఈ కార్యక్రమాలను విజయవంతం చేశాయి.

గుంటూరు జిల్లా కలెక్టరు శ్రీమతి భానూరతన్‌గారు, శ్రీ పి.వి.ఆర్. కె. ప్రసాద్ I A.S. గారు, శ్రీ కె. వి. శివయ్య, శ్రీ అనురాగశర్మ I.P.S. శ్రీ చేబ్రోలు హనుమయ్యగారు, డా॥కె. సదాశివరావుగారు, శ్రీ నిశ్శంకరావు వెంకటరత్నంగారు, డా॥ జమ్ములమడక మాధవరామశర్మగారు, శ్రీమాన్ కోగంటి సీతారామచార్యులు, డా॥ ఆర్. వి. యస్. సుందరంగారు, డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం, డా॥ టి. వి. సుబ్బారావు, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, శ్రీ యామిజాల పద్మనాభస్వామి-మరెందరో ప్రముఖులు సాహితీవేత్తలు, కవి పండితులు ఈ ఐదు రోజులూ ఈ సభావేదికను వివిధ హోదాలలో అలరించారు. మా కోరికను మన్నించి ఈ సాహితీ యజ్ఞంలో పాల్గొన్న సహృదయులందరకూ మా కృతజ్ఞతలు.

మా ఉత్సాహానికి దోహదం చేసి ఈ అవధాన కార్యక్రమం యిలా రూపొందడానికి ప్రధానప్రేరకులు డా॥ ప్రసాదరాయ కులపతిగారు. వారి నిర్వహణాధ్యక్షతన నగరంలో నడిచే సుప్రతిష్ఠతమైన సాహితీ సంస్థ-శ్రీనాథ పీఠం. దేశంలోని నలుమూలల పండితులతో ఉత్తర ప్రత్యుత్తరాలనుజరిపి, ఎందరినో రావించి; ఇంద్రసభ, భువన విజయ కార్యక్రమాలకు సూత్రధారియై నిలిచి సామర్థ్యంతో, చాతుర్యంతో శ్రీనాథ పీఠం ఆధ్వర్యంలో జరిగిన ఈ ఐదు రోజుల పుష్పోత్సవాలు సాహితీప్రియుల మనస్సులలో నిలిచిపోయేట్లు చేశారు శ్రీ కులపతిగారు.

అడిగినదే తడవుగా ఎందరో పెద్దలు ధన సహాయం చేశారు. వారిచ్చిన ధనాన్ని కవితాభివృద్ధికోసం, ఇటువంటి జనానందకరమైన సదస్సుల కోసం ఖర్చు పెట్టగలగడం-నిజంగా ఈ ద్రవ్యం సద్వినియోగమైనదని మేమంతా హృదయ పూర్వకంగా భావిస్తున్నాము.

ఆహ్వాన సంఘ అధ్యక్షునిగా నేనీ నాలుగు మాటలూ చెప్తున్నా, ఆహ్వాన సంఘంలోని సభ్యులైతే అయినా కూడా శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణగారిని, శ్రీ పాలడుగు లక్ష్మణరావుగారిని, డా॥ ముద్దన హనుమంత

రావుగారిని యిక్కడ నేను స్మరించక ఉండలేను. ప్రతి చిన్న పనీ ఎంతో వ్యయమూ, శ్రమగా మారిన ఈ రోజుల్లో 'తాత్విక' సంబంధమైన కార్యాలను ఒక వ్యక్తిగా కాక ఒక సంస్థగా శ్రీ సత్యనారాయణగారు ఎన్ని జరిపారో, ఎంత బృహత్తర ప్రమాణంలో జరిపారో నాకు స్వయంగా తెలుసు. వారిలోని ఉదారత, చొరవ ఈ సాహితీ కార్యక్రమం తెరవెనుక ఉన్న విశేషమైన బలం. అలాగే శ్రీ లక్ష్మణరావుగారు, డా॥ హనుమంతరావుగారు, యిలాంటి కార్యక్రమాలకు దాతల . బాధ్యత-అడగడం హక్కు అన్నట్లుగా వారి మిత్రులనుండి చందాలు వసూలు చేయడంలో నాకెంతో తోడ్పడ్డారు.

ఈ ఉత్సవానికి భూరి విరాళం **L V. R. & Sons club & Reading Room** నుండి లభించింది. వారికి, ముఖ్యంగా శ్రీ కొమ్మినేని సీతయ్య గారికి, శ్రీ సకుర్తి రామయ్యగారికి నా కృతజ్ఞతలు.

తెలిసి గాని, తెలియక గాని ఏర్పాట్లలో ఏదైనా లోటు జరిగి ఉన్నట్లయితే మన్నించవలసినదిగా ఆహ్వానసంఘం తరపున అందరినీ సవినయంగా అభ్యర్థిస్తున్నాను.

ఈ ఉత్సాహంతో, ఈ ఉత్తేజంతో భవిష్యత్తులో ఇటువంటి కార్యక్రమాలు మళ్ళీ మళ్ళీ జరిపించాలని, దానికి సహృదయులైన పౌరులు సహకరిస్తారాని ఆశిస్తాను. సాంస్కృతిక రాజధానియైన గుంటూరు నగరం మరింత లలిత కళా నిలయంగా వర్ధిల్లడానికి అధికారులు, పుర ప్రముఖులు తోడ్పడగలరని విశ్వసిస్తున్నాను.

విద్యాబుద్ధుల ప్రమాణం ఎంతగానో దిగజారి పోయిన ఈ రోజుల్లో ఇలాంటి ఐదు రోజులు మరెన్నో జరిగి అంధకారంలో కాస్తంత వెలుగు చూపాలి.

రాజకీయాలతో కలుషితమై, వ్యాపారాలతో యాంత్రికమైపోయిన మన జీవితాల ఎడారిలో మరిన్ని సాహిత్యపు వానవెన్నెల జల్లులు కురుస్తాయన్న ఆశతో, మన మనసులలో ఇంకొంత ఆర్ద్రత నెలకొంటుందన్న అభిలాషతో — సెలవు తీసుకొంటాను.

# ఆహ్వాన సంఘం, గుంటూరు.

అధ్యక్షులు
డా. కొండబోలు బసవపున్నయ్య

ఉపాధ్యక్షులు
శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ

కార్యదర్శి
డా. ముద్దన హనుమంతరావు

కోశాధికారి
శ్రీ పాలడుగు లక్ష్మణరావు
బ్రహ్మయ్య & కంపెనీ

# శ్రీనాథ పీఠము
## గుంటూరు



అధ్యక్షులు

జన్నత్ హుసేన్ I. A. S.

జిల్లా కలెక్టరు



సహాధ్యక్షులు

R. M. గోనెల I. A. S.

జాయింట్ కలెక్టరు



నిర్వహణాధ్యక్షులు

డా॥ ప్రసాదరాయ కులపతి



కార్యదర్శి

శ్రీ P. S. దత్త ప్రసాద్

శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ వేదపండితుల స్వాగతంతో
శ్రీ మోహనును తీసుకు వస్తున్నదృశ్యం



శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, I. A. S.
పుష్పోత్సవాలను ప్రారంభిస్తున్న దృశ్యం

అవధానప్రారంభ సభలో శ్రీ చేబ్రోలు హనుమయ్య ప్రసంగిస్తున్నారు.
శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, డా॥ కె. బసవపున్నయ్య,
శ్రీ P. V. R. K. ప్రసాద్ కూడా చిత్రంలో ఉన్నారు.

శతావధాన దృశ్యం : డా॥ ప్రసాదరాయకులపతి, డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం
మధ్యలో శ్రీ మేడసాని మోహన్, రెండు ప్రక్కల పృచ్ఛకులు

శతావధాన సన్మాన సభాదృశ్యం. చిత్రంలోనివారు :
శ్రీ యామిజాల పద్మనాభస్వామి, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి,
శ్రీ తుమ్మల సీతారామమూర్తి, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ కె. బసవపున్నయ్య,
శ్రీ మేడసాని మోహన్, శ్రీ కె. వి. శివయ్య, శ్రీ కొసరాజు రాఘవయ్య.

జిల్లా పరిషత్ ఛైర్మను శ్రీ సకుర్తు రామయ్య శ్రీ మేడసాని మోహన్‌ను
సన్మానిస్తున్న దృశ్యం.

డా॥ మద్దిని గోపాలకృష్ణ, శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులను సత్కరిస్తున్నా
శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ, శ్రీ పి. లక్ష్మణరావు చిత్రంలో ఉన్నారు.

డా॥ యం హనుమంతరావు శ్రీ మేడసాని మోహన్‌ను సత్కరిస్తున్న దృశ్యం.
డా॥ కె. బసవపున్నయ్య కూడా చిత్రంలో ఉన్నారు.



శ్రీ తుమ్మల సీతారామమూర్తి, ఆచార్య శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ కె. బసవపున్నయ్య, శ్రీ మేడసాని మోహన్, శ్రీ కె. వి. శివయ్య సన్మాన సభలో పాల్గొన్నదృశ్యం.

శ్రీ అబ్బూరి సుబ్బారావు శ్రీ యామిజాల పద్మనాభస్వామిని సత్కరిస్తున్నారు.

శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి అవధానిని సత్కరిస్తున్నారు.



శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి శ్రీ మేడసాని సన్మాన సభలో
ప్రసంగిస్తున్న దృశ్యం.

13

# శ్రీ మేడసాని మోహన్ చౌదరి

అవధాన చక్రవర్తి, శతావధాన సార్వభౌమ శ్రీ మేడసాని మోహన్ చౌదరి నేడు తెలుగుదేశంలో సుప్రసిద్ధులు. ఆంధ్ర సాహిత్యంలో విశిష్ట ప్రక్రియ అయిన అవధాన కళను ప్రదర్శిస్తూ పండితుల ప్రశంసల నందు కుంటున్న వినయశీలి శ్రీ మేడసాని మోహన్ చౌదరి.

శ్రీ మోహన్ చౌదరి నడింపల్లె గ్రామంలో జన్మించారు. ఇది చిత్తూరు జిల్లా చంద్రగిరి సమీపంలో ఉన్న చిన్న ఊరు. మోహన్ చౌదరి స్వగ్రామంలో విద్యాభ్యాసం చేశారు. శివానందస్వామి వారి నుండి మంత్రోపదేశం పొందారు. పసితనం నుండీ వీరికి పద్య కవిత్వం మీద అభిరుచి వుంది. ధారణాశక్తి అధికం అవడం వలన ఏ పద్యాన్నైనా ఒక్కసారి చదివితే చాలు అది పూర్తిగా గుర్తుండి పోయేది. ఇలా చిన్న తనంలోనే మోహన్ చౌదరి గారికి వేలకొలది పద్యాలు కంఠస్థమయ్యాయి. అటువంటి మేధావికి అష్టావధానం అంటే కష్టం ఏముంది? తమ పద హారవ ఏటనే మోహన్ చౌదరి అష్టావధానాన్ని అతి సులభంగా నిర్వ హింప గలిగారు.

శ్రీ మేడసాని మోహన్ చౌదరి తిరుపతిలో యం. ఏ. పరమపట్ట భద్రులయ్యారు. తరువాత పరిశోధన గావించి, ఇటీవలే పిహెచ్.డి. పట్టాన్ని గూడా పొందారు. వీరు తిరుమల తిరుపతి దేవస్థానంవారి అన్నమాచార్య ప్రాజెక్టులో ఉన్నతోద్యోగం చేస్తున్నారు.

చతుర్గుణిత, షడ్గుణిత అష్టావధానాలను సహితం నల్లేరుపై బండి నడకలాగా నిర్వహింపగల సమర్థులుగా శ్రీ మేడసాని మోహన్ చౌదరి ఖ్యాతి నొందారు. తిరుపతిలో వీరొనర్చిన దశగుణిత అష్టావధానం వీరి కీర్తి కిరీటంలో ఒక రత్నం.

శ్రీ మోహన్ చౌదరి విజయవాడ, విశాఖపట్టణం, విజయనగరం, గుంటూరు పట్టణాల్లో వేలాది రసజ్ఞుల సమక్షాన శతావధానాలను చేసి

తమ ప్రతిభాపాటవాన్ని నిరూపించుకున్నారు. వెళ్ళిన ప్రతిచోట ప్రజలు వీరికి బ్రహ్మరథం పట్టారు. కనకాభిషేకం మొదలైన సన్మానాల నెన్నిటినో వీరు చిన్న వయసులోనే పొందారు.

శ్రీ మేడసాని మోహన్ చౌదరి ఆయురారోగ్యాలతో విలసిల్లుతూ, తమ అవధాన కళా ప్రావీణ్యాన్ని ఇతోధికంగా ప్రదర్శిస్తూ ఆంధ్ర సాహిత్య సరస్వతికి తమ అమూల్య సేవలను అందింతురుగాక!

- శ్రీ పులిచెర్ల సాంబశివరావు

# శుభం భవతు!

## శతావధాన ప్రారంభకులు- శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ I.A.S.

తిరుపతిలో దేవస్థానంలో చిన్న ఉద్యోగంలో చేరే నాటినించి ఇతణ్ణి నేనెరుగుదును. ఈనాడీ యువకుడు ఆంధ్ర సాహిత్యానికి గౌరవ కరమైన శతావధానాలు విజయవంతంగా చేస్తూ పేరు ప్రతిష్ఠలు పొందటం ఎంతో సంతోషకరంగా ఉంది. భవిష్యత్తులో మోహన్ శాశ్వత కావ్య నిర్మాణంచేసి మరింత కీర్తి నార్జించాలని కోరుతున్నాను.

## సన్మాన సభా ముఖ్యఅతిథి - ఆచార్య శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

ఈనాడు మేడసాని మోహన్ ఆంధ్రదేశం గర్వించ దగిన వ్యక్తి. మరుగున పడిపోతున్న శతావధానాన్ని మళ్ళీ వెలుగులు విరజిమ్మజేసిన అద్భుత మూర్తి యితడు. ఈ రోజుల్లో కూడా నూరుగురు పృచ్ఛకులకు ఇంత సామర్థ్యంతో పద్యాలు చెప్పి ధారణచేసి అప్పగించగలవారుండటం విశేషం. ఇతని అనన్య శక్తి సంపదలను నేను హృదయ పూర్వకంగా ప్రశంసిస్తున్నాను.

## సినీ కవి - శ్రీ కొసరాజు రాఘవయ్య

మోహన్ మా స్వంత పిల్లవానివంటివాడు. అతడింతవాడైతే మాకంటే సంతోషించేవాళ్ళెవరుంటారు? సాహిత్య రంగంలో ఇతడు ధ్రువ తార కావాలని నా ఆకాంక్ష. అతని అభ్యుదయం, ఉన్నతి సర్వదా నేను కోరుతూ ఉంటాను.

## భరతవాక్య ప్రవర్తకులు - శ్రీ కె. వి. శివయ్య I A.S.

మోహన్ శతావధాన యాత్రలో సంధాతగా, ఉద్గాతగా దాదాపు అన్ని సందర్భాలలోను నేను పాల్గొన్నాను. భగవంతు డతనికి అద్భుత మైన శక్తిని ప్రసాదించాడు. యశోధన వైభవప్రాభవాలను ఇతోధికంగా అతడు పొందాలని నా ఆశాస్యము.

# ఆశీస్సులు

డా. ప్రసాదరాయ కులపతి

[అవధాన ప్రారంభమున పలికినవి]

కంటికి రెప్పవోలె నిను కాచు కొనంగల తల్లి పల్కువా
ల్గంటి తలంపునందు వెలుగై అలరారుచునుండె నుండె ము
క్కంటిశిరస్సుమీదగలగంగ వచస్సున పెద్దలుండి రే
నుంటి నిమిత్తమాత్రముగ నుల్లసనంబున లెమ్ము మోహనా?

తుచ్ఛులుగా రొకించుకయు దూర్తులుగారు కళాసరస్వతీ
కచ్ఛపి మీటినన్ గలుగు కమ్మని నాదమువోని సాహితీ
పిచ్ఛిలభావ భావుకులు ప్రేమమయుల్ భవదాత్మబంధులీ
పృచ్ఛకులెల్ల నిన్నిట పరీక్షయొనర్తురు నీ హితైషులై

అప్పరమేశ్వరుండు శివుడై గురుడై ఉపదేశమీయ మే
లొప్పెడి కైత తానుదయ మొంది వరించె శతావధానమున్
తప్పక చేయగాగలవు దక్షత సందియ మింత లేదు నే
చెప్పుచునుంటి నీజయము సింధురబంధుర రేఖ జూపుమా!

అభయమునిచ్చి విఘ్నముల నన్నిటినిన్ దొలగింపజేయు నా
యిభముఖుసాక్షిగా చదువులిచ్చెడి తెల్లనితల్లి సాక్షిగా
అభవుని సాక్షిగా ఋషులసాక్షిగ ఈజనకోటి సాక్షిగా
శుభమును పల్కెదన్ వెలుగుజూపుము లెమ్మిక పల్కు మోహనా!

# వర్ణనలు

## శ్రీ టి. నాగేశ్వరరావు

*శ్రీమాతను గూర్చి స్రగ్ధర :*

శ్రీమత్ సౌందర్యమూర్తీ! స్మితవదనరుచిస్ఫీత దివ్యాస్య దీప్తీ!
క్షేమాదిప్రస్ఫురత్ సుస్థిత గుణవిభవస్థేమ సంభారశక్తీ!
ఆమోదస్ఫూర్తితో నిత్యము మము కరుణావ్యాహృతిన్ కావుమమ్మా!
సామాదిప్రస్తుతా! విశ్వశుభవిదిత! శశ్వత్సుఖాన్విత! మాతా!

ఓ సౌందర్యమూర్తీ! మందహాసంతో ప్రకాశించే దివ్యముఖకాంతి గల్గిన తల్లీ! క్షేమంకరమగు స్థిరగుణము కలిగిన శక్తిస్వరూపిణీ! వేద వినుతా! నీవు సంతోషముతో ఎల్లవేళల మమ్ము కాపాడ వేడెదను.

## శ్రీ E. G. K. మూర్తి

*సభను గూర్చి :*

విదిత యశోధురంధరులు; విజ్ఞులు; నిత్యమనోజ్ఞ భావనా
భ్యుదయ కళాప్రపంచ పరిపూర్ణులు పొల్చుచునున్న ఈ సభా
సదనము, మన్మనోంతర నిశాతవచఃప్రచుర ప్రచోదనో
న్మద కలనా కలాపముల మానితలీలఁదలిర్ప జేసెడిన్.

ప్రసిద్ధ యశస్కులు, ప్రాజ్ఞులు, భావుకులతోనిండిన యీ సభ నా మనస్సున వాడియైన ఆశుకవితాధారను సిద్ధింపజేయుచున్నది.

## శ్రీ K. M. D. K. ప్రసాద్

శ్రీ ప్రసాదరాయ కులపతిగారిని గూర్చి పంచచామరము :

ప్రసన్నవాగ్విలోల ధీఃభంకర క్రమాకరున్
రసప్రదీప్త భావనాంక రంజిత స్ఫురన్మతిన్
ప్రసాదమేదురోరు సారవత్సల ప్రభానిధిన్
ప్రసాదరాయ సత్కవీంద్రు, భద్రసాంద్రు గొల్చెదన్.

ప్రసన్న వాగ్విలాసముగల ధీమంతుడును, రసభావుకుడును, ప్రసాద గుణముతో నిరుపమానమగు వాత్సల్యమునకు ఆకరుడును అయినట్టి, ప్రసాదరాయ సత్కవీంద్రుని పూజి తును.

## శ్రీ చందోలు ఆనందకవి

పృచ్ఛకులను గూర్చి :

శ్రీ రసభావులార ! సరసీరుహ నిర్యదమందమాధురీ
సారవచస్కులార ! సువిశాల కవిత్వ జగద్విహారవి
స్ఫారవికాసులార ! బుధవందిత పృచ్ఛకవర్యులార ! వి
స్తారవినమ్రభావ గుణసంగతిఁబ్రస్తుతి సేతు మిమ్ములన్.

రసభావుకులార ! మకరందముతో సమానమగు సారవచస్కులార ! విస్తృతమగు సాహితీప్రపంచమున విహరించుచు ప్రకాశించు బుధవందితులైన పృచ్ఛకులార ! మిమ్ము వినయముతో మీ గుణములను ప్రస్తుతించుచు కొలిచెదను.

## శ్రీ తంగిరాల వెంకటసుబ్బారావు

గాంధీగారు బ్రతికియున్నచో ప్రస్తుతము పంజాబు సమస్యను గూర్చి ఏమనుకొందురు ? ఉత్పలమాలలో

భారత భూప్రజాహృదయ పంకజభూరిమరందసారముల్
పేరిమి పెంపుదక్కెనని పెల్లగు బాధ వహించు గాంధి; వి
స్తార విషాదవేదనలు స్వాంతము నూచంగ పంచవాహినీ
ధారుణి రక్షసేయ నవతారముఁదాల్పంగ రాముఁగోరుచున్.

భారతప్రజల హృదయపద్మాలనుండి స్రవించే సంస్కార మకరంద ప్రవాహానికి పంజాబు సమస్య అడ్డుకట్టగా నిలుస్తూఉంది. మహాత్మా గాంధీ బ్రతికి ఉంటే ఈవిపత్తు నుండి దేశమాతను కాపాడడానికి బరు వెక్కిన విషాద హృదయంతో తన ఇష్ట దైవమైన శ్రీరామచంద్రుని ప్రార్థించి ధర్మసంరక్షణార్థం మరొక అవతారం ధరింపమని అర్థించి ఉండేవాడు.

## శ్రీ వై. వి. వివేకానంద

*వందమంది పృచ్ఛకులను కౌరవులుగా నూహించి చెప్పుమనుట: ఉత్పలమాలలో*

కౌరవగేహముఁచు సభగాంచఁగఁజాలను; ధీప్రపూర్ణకా
సారమునందు సద్విబుధసారసముల్ వికసించెనంచు, సం
భారమరందవాహినులు భావుక లీలలఁబొల్చెనంచు, నీ
శ్రీరస సాహితీసభను చెప్పఁగ వచ్చునటంచు నెంచెదన్.

వందమంది పండితులున్నందువల్ల సభ కౌరవసభలాగా నే భావింప లేను. జ్ఞాన సరోవరంలో వంద పండిత పద్మాలు వికసించాయని భావిస్తున్నాను. ఈ కవి పండితుల్లోని భావుకత మకరందంలా భాసిస్తూ ఉంది.

## శ్రీమతి గుడివాడ ప్రభావతి

*లఘుపతనకుఁడు, హిరణ్యాకుఁడు, సంజీవకుఁడు శిస్సులాంటి నున్నటుల వర్ణన : శార్దూలములో*

నీతిస్నిగ్ధవిచక్షణామతులు డిస్నీలాండు నీక్షించుచో
నేతత్స్ఫూర్తుల నాక్రమించుకొనఁగానెంచున్ మనోవీధిలో;
ఆతంకంబుల జంతుసంతతి మనఁబందెొచఁగాలేదు, ప్ర
స్ఫీతంబైన ప్రసన్న సంస్కృతి యెదన్ చెన్నొందలేకుండుటన్.

పై పేర్కొన్న నలుగురూ డిస్నీలాండు వింతల్ని చూస్తే జంతు సంస్కృతి ప్రస్తుతం కంటే వికసించే అవకాశం ఉందాయని ఆలోచిస్తాయి.

## శ్రీ వై. కృష్ణవేణి

*జూదములో కౌరవులే ఓడి అజ్ఞాతవాసము చేయవలసివచ్చినచో?*

ఆరణ్యంబులఁగౌరవుల్ కడు విషాదాక్రాంత చిత్తంబులన్
గారాముల్ పచరింపఁజాల రచటన్ గంధర్వరాజేంద్ర స
త్కారమ్ముల్ రుచిచూచుచో వికటమాంద్యత్వంబుమై క్షాత్రమున్
దూరీభూతము చేసియుంట నరయన్ దోచు న్నవస్థావళుల్

కౌరవు లొక పర్యాయం ఘోషయాత్రకు వెళ్ళి అరణ్యంలో గంధర్వ రాజుచే పరాజితులై, పరాభవింపబడ్డారు. దీన్ని బట్టిచూస్తే కొన్ని సంవత్సరాలపాటు ఆరణ్యవాసం గడపాలంటే వారికి దుర్భరమే ననిపిస్తుంది.

## కుమారి చింతలపాటి శ్రీవర్ధని

*శతావధానిగారి అవధాన ప్రసవ వేదన, కందం*

భావాంతర వీధీ సం
భావిత వాగ్దేవతా శుభంకర సుకళా
శ్రీవిధి యవధానికి నా
ద్యావిల గతినుండ ప్రసవమన్నది గలదా?

అవధాని భావాంతరాళంలో వాగ్దేవి శుభాన్ని ప్రసాదించే కళాలక్ష్మియై అర్ధ్రిగుణంతో నొప్పారుచుండగా శతావధానం ప్రసవవేదనగా ఎలా ఉంటుంది?

## శ్రీ కె. సుభద్రాదేవి

శ్రీనాథుడు, తులసీదాసు స్వర్గములో కలిసినచో వారి చర్చ, సీసము.

సాహితీ సౌందర్య సంస్కార సంభార
భావనానంద వైభవము మిగుల
సమ్రాట్ ప్రదత్తోరు సత్కార సంక్రాంత
కీర్తివల్లరి రసాకృతుల సెలంగ
రామరసానంద సామ గానార్ణవ
వీధిలో హృదయమ్ము వెలుంగుచుండ
లీలావిశేషలాలిత మనోభూమిలో
కమనీయమూర్తి సాక్షాత్కరింప
నిరువురి పవిత్ర భావవిస్ఫురణలెల్ల
సుకవి శ్రీనాథ తులసిదాసులు పరస్ప
రంబు చర్చించుకొంద్రు స్వర్గంబులోన
సుకవితారాజ్య పీఠికా సూరులగుట.

సాహితీ సౌందర్యాన్ని సాక్షాత్కరింపజేసుకున్నందువల్ల కలిగిన భావానందాన్ని, మహామండలేశ్వరులు గావించిన ఘనసత్కార విశేషాలచే నుపలబ్ధమైన కీర్తిస్ఫూర్తిని, రామనామ సంస్మరణతపస్సుచే సంలబ్ధమైన సామగాన శ్రవణంవంటి అనుభూతి సుఖాన్ని పరస్పరం చర్చించుకొంటూ తద్గతానందడోలికల్లో శ్రీనాథుడు, తులసిదాసు స్వర్గంలో భాసిస్తుంటారు.

## శ్రీ గుంటుపల్లి నాగేశ్వరరావు

*జామాత దశమగ్రహమును గూర్చి, కందం*

దశమగ్రహ ప్రభావము
ప్రశమితమగు నిప్పు డాడుపడుచులకెల్లన్
కుశలమగు ఆస్తిహక్కులు
విశేషముగ నిచ్చి అన్న వెలయుటచేతన్.

అల్లుణ్ణి దశమగ్రహం అంటారు. ఆడపడుచులకుగూడ ఆస్తిలో హక్కు కల్పించిన అన్నగారివల్ల ఇప్పుడా దశమగ్రహ ప్రభావం తప్పి పోయింది.

## శ్రీ ముంలుకట్ల బ్రహ్మానందశాస్త్రి

*శ్రీ వేంకటాచలం శిఖరాలను చూచినప్పటి అన్నమయ భావాలు*

అదిగో! స్వర్ణరుచిచ్ఛటాకలిత శేషాద్రీంద్ర సాంద్రప్రభా
భ్యుదయానందరస ప్రపంచ కలనామోద ప్రభావావళుల్
విదితంబై హరిరాగ రంజితమతిన్ వెల్గొంది చెన్నొందె నా
యెదలో నంచుందలంచు నన్నమయ; ధీహేలల్ పిసాళింపంగన్

అన్నమయ్య అనుభూతిభరితమైన తన బుద్ధి విశేషాన్ని ప్రసరించి బంగారుకాంతులతో విరాజిల్లే వేంకటాచల శిఖరాలను చూచాడు శ్రీ వేంకటేశ్వరస్వామికి భక్తులవట్ల ఉండే అనురక్తి పుంజీభూతకాంతి మంతమై అలా ప్రకాశిస్తూ ఉన్నట్లు ఆయనకు తోచి ఉంటుంది.

## శ్రీ ఆవుల మదనమోహన్

*వందరూపాయలనోటు లభించినందులకు సంతోషించి, దొంగ నోటని తెలిసి విచారించుట*

కనుఁగొన్నంత నితాంతహర్షభరితాక్రాంత స్వభావమ్ముతో
నెనసెన్ బుద్ధికి వందరూప్యముల నోటెంతేని సొంపారి; భా
వన సత్యంబు గ్రహించినంతన దిగుల్వాటించి చాంచల్య చిం
తనుఁడై స్రుక్కును, తన్నుఁదానతఁడు నిందాబద్ధు గావించుచున్

వందరూపాయల నోటు అలవోకగా లభిస్తే చెప్పరాని ఆనందం పొందుతాడు. దొంగనోటని తెలిస్తే, తన అల్పసంతోషిత్వాన్ని తన్ను తానే నిందించుకుంటాడు.

## శ్రీ నల్లా నాగేశ్వరరావు

*తోకతో జన్మించిన శిశువును గాంచి తల్లిదండ్రుల యావేదన.*

వానరజాతి మానవుల పద్ధతికెల్ల సమీపమంచు భా
వానఁదలంచు సామ్యమది వాసిగడింప నదేల సందియం
బూననటంచు భార్య తన యుల్లమునన్ దలపోసె, భర్తయున్
మానితలీల దేవుని విమర్శన చేసె విషాదచిత్తుఁడై.

తోకతో జన్మించిన శిశువునుచూచి తల్లిదండ్రులు పరితపిస్తారు. మానవజాతికి మూలమైన వానరజాతి లక్షణం కదా యని, దైవఘటన యని పరిపరి విధాలుగా తలపోస్తారు.

## శ్రీమతి పి. శాంతకుమారి

*మహాభారతములో పల్నాటి నాగమ్మతో(బోల్చదగిన వనిత: ఉత్పలమాల*

నాయకురాలు నాగమకు నవ్యగుణోన్నతి నొప్పు పోల్కిగా
ధీయుతయైన ద్రౌపది(బదింబది(జేర్కొనుటొప్పు; భీమునిన్
పాయని యుద్ధకేళికయి భాసిల(జేయుట అర్జునాది వి
ద్యాయత వైభవంబులను వ్యర్థములంచు హసించి యుండుటన్.

నాగమ్మకు దీటైన వ్యక్తిగా మహాభారతంలో ద్రౌపదిని చెప్పు కొనవచ్చు. నాగమ్మలాగా కయ్యానికి కాలు దువ్వక పోయినా భీమార్జునుల్ని కయ్యపు మాటలతో రెచ్చగొడుతూ ఉంటుంది.

## శ్రీ బి. మునిరత్నం

*పంజాబు సమస్య*

శాంతిసుఖాలవాలముగ సర్వధరావలయంబుపొల్చు వి
క్రాంతిని మాతృభారత మఖండముగా నిడ(జాలియున్. మత
భ్రాంతి నిరంతరంబు నట పంచనదీ ధరణీ తలంబులో
వంతలు రే(గుచుంట గుణపాఠము నేర్పవలెన్ జనాళికిన్.

ఈ సమస్త విశ్వానికి శాంతిసౌఖ్యాల్ని బోధింవగల శక్తి మాతృ భారతికి ఉంది. కాని పంజాబులో మతభ్రాంతి అందుకు విఘాతంగా పరిణమించింది. పౌరులు ఇది యొక గుణపాఠంగా భావించి సుముచితంగా పరిష్కరించుకొనవలసిన అవసరం ఉంది.

## శ్రీ రామకృష్ణ భాగవతార్

### రామాయణ మంతయు ఒకే పద్యంలో

వరయజ్ఞమ్మునఁ బుట్టి, సీతగొని, శుంభద్రాజ్య భారమ్ముగా
నురుకాంతారము లొప్ప, రాక్షసవధా వ్యూహోద్ధతిన్ పొల్చి, వా
నరసైన్యంబు గ్రహించి భామ మిషగా నానాసురవ్రాతసం
హరణుండై ధర నేలు రాముని, పవిత్రాకారు నర్చించెదన్

రామాయణం లోని ముఖ్యమైన ఘట్టాలు ఇందులో క్లుప్తీకరింపబడ్డాయి.

## శ్రీ కడియాల రామమోహనరాయ్

### శ్రీ యన్. టి. రామారావుగారి పాలనం.

రామారాయ సుధీవరాగ్రణి యశోరమ్యప్రభావల్లరుల్
క్షేమం బొప్పఁగ నాంధ్రదేశమున వాసిం గాంచె; యావత్ప్రపం
చామోదంబు, వినూత్న జాగృతియు, సౌహార్దంబు, సత్పాలనో
ద్దామత్వంబును గాంచి భూప్రజలు నిత్యంబున్ ప్రశంసింపఁగన్

శ్రీ రామారావుగారి పరిపాలనా విశేషం కీర్తిప్రభామంతమై యావత్ప్రపంచమునకు ఆమోదసంధాయకమై, రాజకీయరంగములో ఒక వినూతనచైతన్యమును సంతరించినదై ప్రజలచే కొనియాడబడుచున్నది.

## శ్రీ వావిలాల సుబ్బారావు

### దాత, యాచకుల సంబంధం

సౌజన్యంబుల దాత లెంతయు రసజ్ఞశ్రేష్ఠులై యొప్పినన్
రాజిల్లందగినట్టి యాచకతతుల్ రాకున్నచో, సంపదు
త్తేజంబుల్ భగవత్ ప్రదత్తములుగా దీపించియున్ జీవితం
బాజిం బోలదె; ఈవికై తగిన సౌహార్దంబు లేకుండుటన్

ధాతలు ఎంత రసజ్ఞులైనా, ఉదారులైనా వారి సౌహార్దాన్ని వినియోగించుకోగల్గిగిన యాచకులు ఉండాలి. అప్పుడే ఆ దాత భగవంతుఁడిచ్చే ఎన్నో సంపదలకు తగిన పాత్రుడవుతాడు. సంపదలు ఉన్నా దానగుణం లేనివాని జీవితం యుద్ధకల్లోల సదృశమై ఉంటుంది.

## శ్రీ ఎం. వి. చక్రపాణిరావుగారు

### *తెలుగు గంగ పాట్లు*

ఆకసమందు, శంభుశిరమందున, మంచుమలన్, ధరాస్థలిన్
ఏ కరణిన్ విహారముల సేపు వహించెనొ? యభ్రగంగ; అ
య్యాకృతి తెల్గుగంగకు సమన్వయమై కనవచ్చుచుండె, హే
లాకరలీల భావిని శివాస్పదమై ప్రవహించు గావుతన్

తెలుగు గంగ స్థితిగతులు "పెక్కు భంగులు వివేకభ్రష్ట సంపాతముల్" అన్నట్లుగా ఉన్నాయి. కాని భవిష్యత్తులో శివంకరముగా తెలుగు గంగ పథకం ఫలించునుగాత.

## శ్రీ నడింపల్లి వెంకట అప్పారావు

### *ఈ అవధానమును తిరుపతి వేంకట కవులు చూచినచో ?*

పలుకుల తల్లి లీల కిటు పాత్రముగా కమనీయ వాఙ్మయో
జ్జ్వలమహితానుభూతులను వర్ధిలుచుండెడి బాలకుండు, సం
కలిత వినూత్న భావుక జగద్విదితప్రతిభాప్రకాండుఁడై
అలరుత మంచు నాశుకవనాకృతు లిత్తురు దీవనల్ తగన్

సరస్వతీ కృపాకటాక్షమునకు పాత్రుడై వాఙ్మయలీల ప్రదర్శించే ఈ చిరంజీవి జగద్విదితపాండిత్య ప్రతిభావిశేషంతో దులకించు గాక! అని కవితా మూర్తులైన తిరుపతి వేంకట కవులు దీవిస్తారు.

## శ్రీ సుఖవాసి మల్లికార్జునరాయ శాస్త్రి

*ఈ అవధానమును శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటకవి స్వర్గం నుండి చూస్తూ ఏమనుకొంటాడు? మధ్యాక్కర.*

సాహిత్య జగతిని సారసంభృతోత్సాహ విజయము
వ్యాహృతిన్ బొల్చెను పొంగి వైభవ ప్రాకట గతుల
నాహా! యంచు దలఁచుకొంచు వేంకటోద్యద్గుణహారి
మోహనుం గనుఁగొని మెచ్చె మోద మింపుం దనరఁగను.

సాహిత్య జగత్తులో ఈ శతావధాన విజయం వైభవోపేతంగా ఉంది అని భావిస్తూ చెళ్ళపిళ్ళ వారు అవధానిని మెచ్చుకుంటారు.

## శ్రీ మాధవపెద్ది విజయలక్ష్మి

*రావణుఁడు శివధనుర్భంగం చేసి ఉంటే సీతాహృదయం ఎలా ఉంటుంది ?*

రాక్షసవీరు లెల్లరును రాజిలు చుందురు కామరూపులై
రాక్షసరా జితం డిటులు భ్రాంతి వహింపఁగఁజేయు మాయలన్
దక్షుఁడు! కన్నుకట్టులకు, తప్పులకున్ నిలయంబు వీరి సూ
క్ష్మేక్షిక! ఇట్టి జాణ సమయించిన రాముని కెగ్గు కల్గునే ?

రాక్షసులు కామ రూపులు. మాయలు ప్రదర్శించడంతో నేర్పరులు. రావణుఁడు శివధనుర్భంగము చేసినా ఆ కోవకే చెంది ఉంటుంది.

## శ్రీ సిహెచ్. ఇందిరా దేవి

**కర్ణుని జన్మవృత్తాంతాన్ని గురించి నిజం తెలుసుకొన్న భీముని మనోవేదన.**

శ్రీకృష్ణుండు సమస్త భూవలయ భూభృత్ శ్రేష్ఠుఁగా కర్ణునే
ఆకాంక్షించిన భీమసేనుఁడు తదీయాంతర్గతంబైన స
త్యాకీర్ణస్ఫురణల్ కనుంగొని విషాదాన్వితుఁడై కుంతినే
సాకల్యంబుగ నిందసేయు పటు రోషస్ఫూర్తిమన్మూర్తియై

శ్రీకృష్ణుఁడు సమస్త భూవలయానికి రాజుగా కర్ణుణ్ణి నియమించి ఉంటే, సత్యం తెలుసుకొన్న భీమసేనుఁడు కుంతినే నిందిస్తాడు.

## శ్రీ జి. ఎన్. మూర్తి

**కళాశాలల్లో సెక్సు విద్య బోధిస్తే ఎలా ఉంటుంది ?**

అనుపమ లీలమై దనరు నట్టి కథాళి ప్రయోగశాలలో
కనుఁగొనఁజేయ శిష్యతతి కాంక్ష పెలార్పఁగ, సద్గురూత్తముల్
వినయ విధేయతల్ గలిగి పెద్దలు చెప్పిన లీలఁబాఠముల్
కనుఁగొనుఁడయ్య! స్వానుభవకామన యేల ? యటంచుఁబల్కెదర్

కళాశాలల్లో సెక్సు విద్యను బోధిస్తే ప్రయోగశాలల్లో అనుభూయమానం చేయవలసిందిగా విద్యార్థులు అధ్యాపకుల్ని అర్థింపవచ్చు. అధ్యాపకులు చెప్పినట్లు మాత్రమే వినండని విద్యార్థుల్ని బుజ్జగింపవలసి వస్తుంది

# దత్తపదులు

## శ్రీమతి ఐ. రామలక్ష్మి

***రంజని, నిరంజని, శివరంజని, నయనరంజని అను పదములతో సరస్వతీస్తుతి.***

రంజనివై రసాబ్ధులను రంజిలఁజేయుచు, సారభావహృత్
కంజములన్ నిరంజని నికామనగా మృదుభావనాళిచే
రంజని నిత్యసత్య శివరంజనిగా వెలుగొందు భారతిన్
ప్రాంజలి గొల్చెదన్ నయనరంజనిగా నెదలోన నిల్వఁగాన్.

రససాగరాల్ని రంజింపఁజేస్తూ, సారమతుల హృదయ కమలాల్ని వికసింపఁజేస్తూ, మృదుమనస్కుల హృదయాంతరాల్ని చేరి నిత్య సత్య శివరంజనిగా వెలుగొందే సరస్వతీదేవిని నయనానందకరంగా సాక్షాత్కరింప గోరెదను.

## డా॥ బి. ఐ. శారద

***నాట, వసంత, హిందోళ, సురట అను పదములలో జాతీయ సేవా శిబిరం విద్యార్థినులకు సందేశం. ఉత్పలమాల.***

లాలిత భావనాబలకలాపము లొప్పఁగ తెల్గునాటను
ద్వేల వసంత వైభవము దోపిలఁజేయుఁడు, రాగరాజ హిం
దోళ సమానవై ఖరులఁ దోఁపఁగఁజేయుఁడు సేవనాళి, ని
ష్ఠాలసదాత్మదీప్తి సురటద్గతు లొప్పఁగ సోదరీమణుల్

జాతీయ సేవా శిబిరంలోని సోదరీమణులైన విద్యార్థినులు ఆత్మ తేజస్సులు ధ్వనించే రీతిలో తమ సేవాదృక్పథంతో తెలుగు నేలపై

వసంతఋతు వైభవాన్ని, హిందోళరాగ శ్రవణానందాన్ని చిందింప
జేయాలి.

## శ్రీమతి కొల్లా రాధాబాయి

***కలికి, కులికి, చిలికి, పలికి అనే పదాలతో మోహినీ అవతార లీల. చంపకమాలలో***

కలికి తనంబు మీరఁగ జగన్మథు మోహిని యైన స్వామినిన్
కులికి కనం దొడంగి రటు క్రూరులు రాక్షసులయ్యెడన్ దగన్
చిలికిన యట్టి ప్రేమరస సింధువు విష్ణువు హావభావముల్
పలికిన తీరు మాయలను ప్రాపిలఁజేసెను దుష్ట జాతికిన్

విశ్వమోహన శోభావిశేషాలను సంతరించుకొన్న స్వామి మోహినీ రూపం రాక్షసజాతిని మాయలో ముంచివైచింది.

## శ్రీ స్వర్ణ రవికుమార్

***కటిక, ఘటిక, పటిక, చిటికె. భారతార్థము - చంపకమాల***

కటిక తనం బదేల ? అట కౌరవులన్ నశియింపఁజేసి నే
ఘటికను రాజ్య భాగమును గైకొని వచ్చెదనన్న బెల్లపున్
పటికలఁబోలు మాటలను పక్కెడి కృష్ణునితో డిదేల? నా
చిటికెన వ్రేలు పట్టుకొని చెచ్చెరతో నరుదెమ్ము ఫల్గుణా!

భీముడు అర్జున సహితుఁడై కౌరవులను తుదముట్టింపగలనని పలికే సందర్భం.

## శ్రీ వి. సత్యనారాయణ శాస్త్రి

***శాంతి, భ్రాంతి, క్రాంతి, దాంతి. పంజాబు సమస్య-ఉత్పలమాల***

భ్రాంతి మత ప్రసక్తముగ భారత భూవలయంబులోన వి
క్రాంతి వహించుచున్నయది కోరియ వెట్టెడి దుష్టశక్తులన్
శ్రాంతి వహింపఁజేయుటకు సత్పథసంకలితానుభూతులన్
దాంతి గభీరతా గుణము దార్కొనఁ గావలె పౌరబుద్ధికిన్

## శ్రీ సిహెచ్. శివరామకృష్ణమూర్తి

**కాన, వాన, జాన, దాన. రామాయణార్థంలో. ఉత్పలమాల.**

కానన సీమకున్ సతిని గైకొని పోవుటయన్న రాము భా
వాన విషాద మించుకయు పట్టదు; ముగ్ధగుణా! కుమారరా
జా! ననుఁజూడుమో యనెడి క్ష్మాపతిపై పితృదేవుపై మదిన్
దా నను బంధ మేమియును దాల్పడు నిశ్చల ధీగభీరుఁడై

అడవులకు వెళ్ళవలసి వచ్చిందని రాముడు ఏమంతైనా చింతింప లేదు. పితృవాక్యపాలనం కోసం నిశ్చల గంభీరుడై వనవాసానికి సమ్మతించాడు. తిరిగి పితృదేవుడే పిలిచినాగాని మమకారాదులకు దూరంగానే ప్రవర్తించాడు.

## శ్రీ కన్నెగంటి ఉమా కుమారి

**వృత్తము, నియతవృత్తము, సహాయవృత్తము, దీర్ఘవృత్తము లతో ఛాలెంజర్ పతనం.**

రాజత్ వృత్త ముపగ్రహాకలితమై క్రాంతిన్ నభోవీధి ను
ద్భ్రాజత్ చంచలతా గతిన్ నియతవృత్తమ్మున్ విడెన్; నౌకపై
ధీజైత్రాంక సహాయవృత్తములు సందీపింప లేకుండుటన్
భ్రాజిల్లెన్ ప్రజ దీర్ఘవృత్తముగ సంభావించుచున్ తత్కథన్

ఛాలెంజర్ ఉపగ్రహం నియతత్వాన్ని వదలి పతనమైంది. ఆ విశేషాన్ని జనులు దీర్ఘవృత్తాంతంగా చర్చించుకున్నారు.

## శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డి

***దాడి, పాడి, మేడి, కోడి. రైతు శ్రేయస్సును గూర్చి శార్దూలము.***

యావద్భారతమందు దాడి గొని బాహాటించు దుశ్శక్తులన్
పోవంజేయుట పాడి, సంపదుదితస్ఫూర్తిన్ సమస్తోర్విలో
నావేదంబున మేడి పట్టుకొని నిత్యంబున్ శ్రమా బంధుర
ప్రావిర్భూతుల దీప్తి కోడిన ప్రభుత్వానీకముల్ మీరఁగన్

ఈ సమస్త సృష్టిలో సంపద సృష్టికి మూల కారకులైన రైతుల వేదనను గుర్తించే ప్రభుత్వాలు అతిశయించాలి. ఇందుకు వ్యతిరేకించే దుశ్శక్తుల్ని పారఁద్రోలాలి.

## శ్రీ వడ్లమూడి వెంకటేశ్వరరావు

***మేషాది గ్రహరాశుల పేర్లలో అరింటిని ఉపయోగించుచు అమ్మవారి స్తుతి.***

అనిమేషంబుగ నీమహాకృతిని భావాంతర్గతిం జూచి, సం
జనితోల్లాసము మైనుతింతు వృషభాంచద్వాహనాత్మేశ్వరీ!
నిను కన్యా మృదు మూర్తిగా, మిధున సందీప్తాఢ్యగా, సింహవా
హనగా మ్రొక్కుచునుందు భక్తులు సమస్తాకార! కుంభస్తనీ!

పరమేశ్వరుని ప్రాణేశ్వరీ! నిన్ను రెప్పవాల్చక అంతరంగంలో సాక్షాత్కరింపఁజేసికొని ప్రార్థిస్తాను. వివిధ స్వరూప విశేషాలతో భాసించే నీ మూర్తిని భక్తులు ఆరాధిస్తూ ఉంటారు.

## శ్రీ పాతూరి వెంకటరామః శాస్త్రి

***పలక, కలక, గిలక, మొలక అను పదములతో భీమకీచక సంగ్రామము-చంపకమాల.***

పలకలుగా ప్రహారములు వాగవు! భూరిపరాక్రమోన్నతుల్
కలకలు రేపగాఁ దొడఁగె క్షాత్రగుణోద్ధతి మీర; భీముడున్
గిలకలు త్రిప్పఁగాఁదొడగె కీచకునిన్; కనుగొన్న లేమకున్
మొలకలు వేయఁగా దొడఁగె మోదము భీముని రోషవిస్తృతిన్

దెబ్బల సవ్వడులు వినిపింపవు. భీమకీచకుల్లో ఉండే క్షాత్రం విజృంభించింది. భీముడు కీచకుణ్ణి గిలక లాగా త్రిప్పికొట్టసాగాడు. ద్రౌపదికి ఆనందం కలిగింది.

## శ్రీ పులిచెర్ల సుబ్బారావు

***మదరాసు, విజయవాడ, రేపల్లె, గుడివాడ పదాలతో ఉత్పల మాల-భారతార్థంలో***

సల్లలితోజ్జ్వలత్సుగుణ సమ్మద! రాసులు గాగ నాయుధాల్
ప్రల్లదమయ్యెడిన్ విజయ! వాడని వీఁడడటంచుఁ బల్కె రే
పల్లె కుమారుఁ డద్ది విని పావని ఇట్లనె సంగరోన్మదో
త్ఫుల్లమనస్కులై అనికి పూనఁగ సాఁగుడి!వాడ వీఁడఁగన్.

శ్రీకృష్ణుడు అర్జునునితో సుయోధనుడు యుద్ధానికి సన్నద్ధమౌతున్న విషయం చెప్పసాగాడు. భీముడు విని సంతోషించాడు. అందరినీ రణాయత్తుల్ని కమ్మని చెబుతున్నాడు.

## శ్రీ జన్నాభట్ల జనార్దన శర్మ

***భువన-పవన-నయన-తవన-అనే పదాలతో కృష్ణుని రాసక్రీడ.***

భువనమనోహరస్ఫురిత ముగ్ధరసాకృతులైన యంగనల్
పవనచలద్విలోల యుత భావనలై యరుదెంచి, కృష్ణుపై
వివిధ గుణోన్నతిన్ నయనవిశ్రుతలీల పరిభ్రమించి యా
త్రివిధులు డిందఁగా తపన దీర్చి కొనంగ దొడంగి రయ్యెడన్

భువనమనోహర సౌందర్య విశేషాలతో అతిశయించే గోపాంగనలు గాలిలాగా చలించ తమ మనస్తత్వాల్ని కృష్ణునిపై కేంద్రీకరించి అతని చుట్టూ పరిభ్రమిస్తూ అంతరంగాల్లో తపన తీర్చుకోసాగారు.

## శ్రీ షేక్ వహౌలాలి

***ఉండవల్లి, కొండపల్లి, ఖండవల్లి, మండవల్లి. చంపకమాలలో శరదృతువర్ణన.***

తనరుచు నుండ వల్లియలు దార్కొని నట్లుగ శ్వేత మేఘముల్
అనయము కొండపల్లియల యందున సైతము స్వచ్ఛసార జీ
వనము లఖండవల్లికుచ బంధురలీల నెసంగెడున్, శరత్
ఘనగతి దిగ్దిగంతరవికాస విలాసము మండవల్లిగన్

శరదృతువులో కొండపల్లెల్లో సైతం స్వచ్ఛమైన వాతావరణం భాసించింది. ప్రకృతి స్వచ్ఛ నిర్మలమైంది.

## శ్రీమతి ఏ. అరుణకుమారి

***ధాత - ఈశ్వర - దుర్మతి - దుందుభి. రావణ పాత్ర చిత్రణ***

పొందెను ధాతచే వరవిభూషణముల్ పటుయోగ భావనా
స్పందిత లీల నీశ్వరశుభంకరలింగము నొందె దేవతా
క్రందనముల్ వినందొడఁగి రాక్షసులందున దుర్మతిం బలెన్
దుందుడుకున్ వహించె జయ దుందుభి రాముని మ్రోలమ్రోఁగఁగన్

రావణుడు బ్రహ్మచే వరాలు పొందాడు. ఈశ్వరుని ఆత్మలింగం సాధించాడు. కాని దేవతల్ని కష్టపెడుతూ గర్వంగా చరించాడు. అందుకే జయభేరి రాముని పక్షంలోనే మ్రోగింది.

## శ్రీ జి. వి. వి. సుబ్బారాయుడు

***అరణి, తరణి, భరణి, కరణి. రామాయణార్థం-కందం.***

అరణితము లల్లె మంథర
తరణి కుల శ్రేష్ఠు రాము తాఁగుందించెన్
భరణి పతి రాజ్యపీఠికి
కరణిగ లేదన్న గాధ కనుఁగొనకుండెన్.

మంథర అల్లరాని మాట లల్లింది. సూర్యవంశోత్తంసుడైన శ్రీరాముని బాధింప తలచింది. రాజసింహాసనానికి రాముడు భరణి వంటి వాడని ఆ వైనం తెలుసుకోలేక పోయింది.

## శ్రీ సి. వి. కె. వై. శర్మ

***బ్రాకెట్టు, రాకెట్టు, లాకెట్టు, జాకెట్టు పదములతో అవధాన క్రీడా వర్ణనము.***

రారాజత్కమనీయ భోగముల న బ్రాకెట్టులో నట్టుగా
గారా మొప్ప వధానవేగవిధి ఏక్రాంతించు రాకెట్‌గతిన్
తోరంబైన పదప్రయోగ భరవిద్యుద్దీశలాకెట్టులో
సారస్యంబుల వచ్చుచోఁ గుకవి తాఁ జాకెట్టులుండున్ ధరన్.

(1) అప్ + రాక + ఎట్టు
(2) రాకెట్.

(3) శలాక + ఎట్టు

(4) చాక (చావక) + ఎట్టు

అవధానంలో నీరధారాడంబర సదృశంలో శబ్దధార విజృంభిస్తుంది. వివిధ పద ప్రయోగాలనే తటిత్కాంతులు జన్మిస్తూ ఉంటాయి. ఇటు వంటివి కుకవులకు మరణపర్యంతంగా ఉంటాయి.

## శ్రీ ఎస్. ఎం. ఎస్. భానుప్రసాద్

***కలము, ఖలము, కులము, హలము అను పదములతో భారతార్థమున చంపకమాల.***

కలమని పాండుపుత్రులిదె కన్పడిరంచు సుయోధనుండు తా
బలమును జూచి పల్కెఁ; నరుపైన మెరింగెను మత్స్యయంత్ర మా
కులము వహింపఁజేయ హరి; కోమలి ద్రౌపది యెంతయున్ కుతూ
హలమునఁ బుష్పదామమటు లర్జును కంఠమునందు వైచె దాన్

ద్రౌపదీ స్వయంవర సందర్భములో పాండవుల ఉనికిని గమనించి తన బలగంతో విచారించాడు సుయోధనుడు. మత్స్య యంత్ర ధ్వంసనం చేసినవాడు అర్జునుడని కృష్ణుడు గుర్తించాడు. ద్రౌపది అర్జునుని కంఠసీమలో పుష్పహారం వైచింది.

## శ్రీ ఆరవిండ్ల వెంకయార్య

***రక్తి, శక్తి, భక్తి, ముక్తి అను పదాలతో ప్రబోధాత్మకముగా ఉత్పలమాల.***

రక్తి హృదంతరంబులఁ బరస్పర మొప్పఁజరించు టొప్పు; చిత్
శక్తి వహించు నైతిక విశాల బలోన్నతి కల్గునట్లుగా
భక్తి వహించి సౌరదృఢ బంధురదీక్షల లౌక్యభావనా
ముక్తిని గోర శాంతి సుఖముల్ ఘటియిల్లును మానవాళికిన్

మానవులందరూ పరస్పరం అనురక్తితో మెలగాలి. జ్ఞానసముపార్జనకు మూలమైన భగవద్భక్తి అలవరచుకొని జీవన్ముక్తులు కావాలి.

## శ్రీ యస్. పూర్ణచంద్రరావు

***రాముని, భీముని, కాముని, సోముని అను పదములతో కృష్ణ స్తుతి, కందము. పై పదములు నిర్ణీతార్థములతో రాకూడదు.***

రాము నినుఁజేరఁగా! హత
భీ! మునివరవినుత! కృష్ణ! విశ్వాతీతా!
కాము నిను కను ఘనుల మీ
సోము నినుం జేరనీక, ఉల్లములందున్.

ఈ సు + ఓము = ఈ సోము

ఓ కృష్ణా! మునివరులచే నుతింపబడువాడా! భయాదిగుణములను పారద్రోలువాడా! విశ్వాతీతా! నిన్ను చేరుటకు రాలేము. నిన్ను చూచు వారమూ కాము. ఈర్ష్యాది గుణాలు మా మనస్సుల్లో ఉండడం చేత నిన్ను చేరుకోలేక పోతున్నాం.

## శ్రీమతి వైష్ణవీదుర్గ

***శిరము, కరము, వరము, ధురము అను పదములతో శ్రీనాథపీఠ వర్ణన.***

శిరముల్ కంపనసేసి మెత్తురు కవుల్ శ్రీనాథపీఠన్, రసా
కరమున్ సంస్తవనైక పాత్రమని సంకల్పింతు రశ్రాంతమున్
వరముఖ్యోత్తములైన పండితులచే భాసించి విఖ్యాత బం
ధురమున్యాళిని బోలు సద్బుధులచే తోరంబుగా నొప్పుటన్.

సుకవులు శిరఃకంపంతో శ్రీనాథపీఠాన్ని మెచ్చుకుంటారు. శ్రేష్ఠులై మహర్షుల వంటి పండితులకు నిలయమైన ఈ పీఠం అవశ్యం ప్రశంసార్హం.

## శ్రీ పళ్ళె నరసింహాచార్యులు

***కంటిని, మంటిని, మింటిని, అంటిని పదములతో ధృతరాష్ట్రుని వాక్యాలు.***

కంటిని హరివిశ్వాకృతి
మంటిని కురురాజులందు మహితాత్ముడుగా!
మింటిని మంటిని ఒకటిగ
అంటి నిగుడు విశ్వమూర్తి నరసితి బుద్ధిన్

కౌరవ సభలో స్వామి విశ్వరూపాన్ని సందర్శించిన ధృతరాష్ట్రుని స్వగతం.

## శ్రీ గద్దె బుచ్చయ్య

***కృష్ణ, అర్జున, భీమ, సుయోధన. రామాయణార్థంలో మత్తేభం***

కలిగెన్ రావణ! కృష్ణపక్షము భవత్ కంఠాళికిన్ విక్రమో
జ్జ్వలుడై, అర్జున భూజమట్టు లనిలో క్ష్మాం గూల సేలా! శుభా
కలితాపాంగము భీమ లింగము కడున్ గైకొన్న శూరుండపై
ఖలుడౌ దెందులకీ సుయోధనయ మార్గంబా! విచారింపుమా!

ఎందులకు + ఈసు + యోధ + నయ

రావణునకు విభీషణుడిస్తున్న సలహా ఇది. అన్నా! రావణా! నీకంఠాలకు కృష్ణపక్షం రానీయకు! విక్రమశాలివై కూడ రాముని చేతిలో ఏల

సంహరింపబడతావు? పరమేశ్వరుని ఆత్మలింగాన్ని సంపాదించిన నీవు ఈర్ష్యాది గుణాలకు తావీయకు.

## శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ

**అన్న, కన్ను, సన్న, మున్ను అను పదములతో శార్దూలము. ఆకలితో నక నక లాడే వ్యక్తి యొద్దకు మేనక శృంగార వాంఛతో వస్తే ?**

అన్నా! మేనక నంపినన్ జనులు శాంతాన్వితులై యుందురే!
కన్నుల్ కాయలుగాచె నన్నమునకున్ కర్మాధికంబై యొడల్
సన్నన్ పాపము వచ్చుగాదొకొ ? భవత్ సంపద్విశేషాళికిన్
మున్నుల్లాసముమై దయాభిరతి నామోదింపుమా! బుద్ధిలోన్

## శ్రీ కొల్లా రాజ్యలక్ష్మి

**తేలుకుట్టు, అమ్మపెట్టు, చెంపపెట్టు, నీటిబొట్టు అను మాటలతో స్త్రీల హక్కులను గూర్చి పురుషుల బాధ. కందము.**

పరిణతులు తేలుఁ కుట్టు సు
రరుదగు పెద్దమ్మపెట్టులడఁగు నతివలన్
దురితులకు చెంపపెట్టగు
హరితము కన్నీటి బొట్టు హక్కు కలుగుటన్

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

**చైనా, జపాన్, ఇరాన్, ఇరాక్. భారతార్థమున**

శ్రీహరి పెలుచైనాడవు మోహమూని
నీ జపానురాగులు పాండునృపతిసుతులె
పోయి రాకురు సమ్రాట్టు మ్రోల మాయ
లోయి రాను నీ నిర్ణయం బొప్పుకొనగ

# సమస్యలు

## శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయ ప్రసాద్

***సంహరించె నసుజు లుబ్బ సతిని బట్టి భీముఁడున్***

కింహతావశేషమంచుఁ గీర్తిఁజేసి దేవతల్
సంహృతిన్ వినోదులౌచు సానుభూతిఁజూపఁగా
సంహరణమె రణము గాగ సర్వకౌరవావళిన్
సంహరించె, నసుజులుబ్బ సతిని బట్టి భీముఁడున్

పట్టి=వలన అనే అర్థంలో ప్రయోగింపబడింది.

ఇది ఉత్సాహ వృత్తము.

## శ్రీ కౌతా సుబ్రహ్మణ్యశాస్త్రి

***దూరెను మేడసాని కడు ధూర్తత కన్పడు సాని మేడలో***

భూరితపోబలంబు మెయి బొల్పుఁవహించెడి మిత్రుడొక్కడే
వారిజనేత్రకో మనసు పడ్డ కథాగతి నాలకించి వి
స్తారితమైన బాధమెయి చయ్యన నాతనిఁ జూడఁగోరి తా
దూరెను మేడసాని కడు ధూర్తత కన్పడు సాని మేడలో!

నిష్ఠాగరిష్ఠుఁడైన ఒకానొక మిత్రుడు వేశ్య వలలో పడ్డాడన్న వ్యథతో, అతణ్ణి వెంటనే చూడాలి అన్న తపనతో మేడసాని సాని ఇంటిలో దూరాడు.

## శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులు

***జ్యోత్స్నాలేప మమాసరేయి కొదవెన్ చోద్యంబు నల్మూలలన్.***

కృత్స్నాభావన వీడి ఈశ్వరుని సాహిత్యంబు దీపింప; సం
పత్సిద్ధాకృతి విశ్వరూపమును సంభావించి హర్షించుచో
సత్స్నేహంబున నాంబికేయు డిటులన్ స్వాంతాన భావించె తాన్
జ్యోత్స్నాలేప మమాసరేయి కొదవెన్ చోద్యంబు నల్మూలలన్

ధృతరాష్ట్రుడు కృష్ణుని విశ్వరూపాన్ని చూచి అమావాస్య రాత్రికి వెన్నెల సాంగత్యం కలిగినట్టుగా భావించి ఆనందించాడు.

## డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ

***రాముఁడు రామునిన్ గెలిచి రాజిల రాముని మెచ్చె రామునిన్***

భ్రామిత భావనల్ విడియ భార్గవరాము హసించుచో, ప్రస
న్నామలుఁడయ్యె గాధిసుతుఁడభ్యుదయోన్నతి యజ్ఞరక్షయున్
కోమలి పెండ్లియున్ దెలిసి కోవిదుఁడౌచు చమత్కరించుచో
రాముఁడు రామునిన్ గెలిచి రాజిల రాముని మెచ్చె రామునిన్

రాముఁడు = శ్రీరాముఁడు

రామునిన్ = పరశురాముని

గెలిచి = జయించి

రాజిల = ప్రకాశింపఁగా

రాముని = రాజులందు మునిగా వైన విశ్వామిత్రుడు

రామునిన్ = శ్రీరాముని

మెచ్చెను = ప్రశంసించెను.

## శ్రీ వారణాసి వేంకట భానుమూర్తి

***కోతిని పెండ్లియాడె నొక కోమలి కోరిక ఉద్భవింపఁగన్.***

ఆతత పుష్పబాణ సముదంచిత వీరవిలాసపై ఖరిన్
చేతము నుత్తలంబు మెయిఁ జిందఁగఁ జేయఁగ కోతి చేష్టలన్
బ్రాంతిగఁ జూపుచో విసిగి భావ్యము గాగ పరిత్యజించె న
క్కోతిని; పెండ్లియాడె నొక కోమలి కోరిక లుద్భవింపఁగన్.

## డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు

### *సెంకీ రేవడుసా యనంగ నదియిస్కిస్కెలె పోపొమ్మనెన్*

సంకల్పంబున భోజనేచ్ఛ మిగులన్ సంప్రేరితోన్మత్తుఁడై
శంకాతంకము లేల యంచు మదిరాశాబద్ధ సంభావనా
సంకీర్ణంబుగ నూఁగుచున్ రజకుఁడుత్సాహంబుమైఁ బల్కె నో
సెంకీ! రేవడుసా ? యనంగ నది యిస్కిస్కెలె, పోపొమ్మనెన్

ఒక చాకలివాడు ఉన్మత్తుడై, త్రాగిన మైకంలో తన భార్య ఎంకితో "రేవు అడుసుగా ఉందా?"-అంటాడు. అది "లేదు ఇసుకగానే ఉంది" అని అంటుంది.

## శ్రీ యామిజాల పద్మనాభస్వామి

### *పైటఁ దొలఁగించి కోడలు శ్వశురు గోరె!*

సోలి వేసవి పోకడ తాళలేక
అంగన హిడింబ వాయుదేవానుభూతి
వాంఛ సేసిన యుచితంపు భావమరయ
పైట తొలఁగించి కోడలు శ్వశురుగోరె!

హిడింబ భర్త భీముఁడు. భీముని తండ్రి వాయుదేవుడు. వేఁడికి తాళలేక హిడింబ పైట తొలగించి గాలిని కోరుకుంది.

## శ్రీ వి. వి. యస్. అవధాని

*తండ్రి గదా యటంచతివ తమ్ముని గోరెను మారుకేళికిన్*

గంధ్రశలు మాని స్వర్గపురి కాంతలు గైకొను ధర్మ సంగతిన్
సేంద్రము లేక యెల్లరకు వేడ్క యొనర్తురు పోరఁ జచ్చినన్
తీంద్రముఁ జూపి వచ్చిన సుధీరుల యందున వృద్ధుఁగాంచి బల్
తండ్రి గదా! యటంచతివ తమ్ముని గోరెను మారుకేళికిన్

యుద్ధంలో మరణించి వచ్చిన ఇద్దరు సోదరులలో పెద్దవాడు వృద్ధుడు తండ్రిలాగా ఉంటాడని, అతని తమ్ముని ప్రౌఢిగలిగిన వాడుగా భావించి దేవవేశ్య వాణ్ణే వరించింది.

## శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మ

*కర్ణుని తోడ ద్రౌపదికిఁగల్గె వివాహము వైభవంబుగన్.*

దీర్ణదుదాత్త విక్రమమతి ప్రవరోత్తములైన పాండవుల్
పూర్ణమనోజ్ఞమూర్తులయి పొల్చిరి నేఁడు తదీయ విక్రమా
కీర్ణమహాగ్నిలో శలభకీలితుఁడీతఁడు ఏల వాదమీ
కర్ణుని తోడ? ద్రౌపదికిఁ గల్గె వివాహము వైభవంబుగన్.

పాండవుల పరాక్రమాగ్నిలో శలభంలాగా కాఁదగిన వాడు కర్ణుఁడు. అతనితో వాదమెందుకు? ద్రౌపదికి వైభవంగా పాండవులతో వివాహము జరుగుతుందిగదా?

## డా॥ మారుటూరి పాండురంగారావు

*దత్తుఁడు పెండ్లాడె తనదు తనయుని వేడ్కన్.*

చిత్తము నందున భీష్ముని
వృత్తాంతము గని తదీయ విధి సేయుటకై
నత్తరుణిఁ దెచ్చె తనయుఁడు
దత్తుఁడు పెండ్లాడె తనదు తనయుని వేడ్కన్.

సత్యవతితో శంతనుని పెండ్లికి భీష్ముడు ఎలా కారకుడయ్యాడో ఇప్పుడు దత్తుని పెండ్లికి గూడా ఆయన తనయుడు కారకుడయ్యాడు.

దత్తుడు అంటే ఈ శతావధాన కార్యకర్తలలో ఒకరైన దత్తాత్రేయులుగారు. "వేడ్కన్" అన్నచో పంచమ్యర్థం ప్రయోగింపబడింది.

## శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు

***భీరుని ప్రాపు గాంచి యరివీరుల నొంచెఁ గిరీటి ఆజిలో***

సారతర ప్రసన్న విలసద్గుణ రీతులుఁ ధర్మ సంగతుల్
పారము ముట్టఁగా నెరిఁగి భాసుర విక్రమకేళి మీరఁగా
ధీరగుణోచితంబయిన తేజము చూపు హరిన్, ప్రసన్నగం
భీరుని ప్రాపుగాంచి యరివీరుల నొంచెఁ గిరీటి ఆజిలోన్

ప్రసన్న గంభీరుఁడైన శ్రీకృష్ణుని ప్రాపుతో అర్జునుఁడు శత్రువుల్ని జయించాడు.

## శ్రీ నారపరాజు రామకృష్ణారావు

***స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గద్దా! పెద్దవై నావటే ?***

అంభోజాసన కల్పధీవిశద విద్యా వైభవప్రక్రియా
రంభాకారులు పండితోత్తము లపారజ్ఞానులై యుండియున్
జృంభత్సంగతి మాని క్రింద నడువన్ ఛీ! ఏమి దౌష్ట్యమ్మొ? ఈ
స్తంభాగ్రంబునఁ గూరుచుండుటకు గద్దా! పెద్దపై నావటే!

అపార జ్ఞానసంపన్నులంతా క్రింద నుండగా గద్ద స్తంభాగ్రము పై కూర్చోవడం దౌష్ట్యంగా భావించడం జరిగింది.

## శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు

***రాము వరించె ద్రౌపది పరాక్రమ ధాము స్వయంవరమ్మునన్***

శ్రీ మహితాను భూత వివశీకృత నిష్ఠ హృదంతరంబులో
స్థేమముగాగ నొప్పు మృదు చిత్తుఁడు తానటు మత్స్యయంత్రమున్
కోమలి కోసమై విరిచె కోవిదు లుబ్బ నరుండు! సద్గుణా
రాము వరించె ద్రౌపది పరాక్రమ ధాము స్వయంవరమ్మునన్

సద్గుణారాముఁడు, పరాక్రమధాముఁడు నైన అర్జునుని ద్రౌపది స్వయంవరంలో వరించింది.

## శ్రీ జి. వి. హరనాథ్

***లంజతనంబులో యశము లాస్యముఁజేసె జనమ్ము మెచ్చఁగన్.***

మంజుల భావనాబల సమంచిత దీక్షవహించి; మిత్రహృత్
కంజము లెల్ల మిక్కిలి వికాసము నందగఁ రామరాయడొ
ప్పం జిరసారయత్నము గభీరతఁజేసి తదీయ దీప్తహే
లం జతనంబులో యశము లాస్యము చేసె జనమ్ము మెచ్చఁగన్.

"హేలన్ + జతనంబులో"

రామారావుగారి దీక్షాదక్షమైన ప్రయత్నంలో జనప్రశంసనీయంగా కీర్తి లాస్యం చేసింది.

## శ్రీ భారతుల నరసింహశర్మ

***త్రాడు భుజంగమై కరచె తాపము దీర్పఁగ మోవి నీయవే?***

పోడిమి మీర మన్మథుఁడు పుష్పశరంబుల నొప్పు ప్రౌఢిమల్
వాడిగ సూపఁగాఁ దొడఁగె వాని మహోత్కట ధాటి ఎంతయున్
గాఢము నిత్యతప్తమయి కారియపెట్టుచునున్న జిహ్వయన్
త్రాడు భుజంగమై కరచె తాపము దీర్పఁగ మోవి నీయవే!

## శ్రీ ఏలూరి మల్లికార్జునరావు

***దృఢసత్త్వంబున దోమ తుమ్మెగదరా విద్దంతు లల్లాడఁగన్***

ప్రఢిమల్ సూపుచు ఫల్గుణాత్మజుఁడు మాద్యద్విక్రమాక్రాంత ఢా
క్కఢమత్కార నికామనారవమహోగ్రస్ఫూర్తి భాసించుచో
బ్రఢిమన్ శాంతనవాదు లిప్పగిది సంభావించి నా రాత్మలన్
దృఢసత్త్వంబున దోమ తుమ్మెగదరా దిగ్దంతు లల్లాడఁగన్

అభిమన్యుని విజృంభణం చూచి భీష్మాదులు "దోమ తుమ్మితే దిగ్దంతు లల్లాడినట్లుంది" అని భావిస్తున్నారు.

## శ్రీ కర్రా ఈశ్వరరావు

***అమిత విజృంభణంబు లబలా! తగునా! సుజనాళి కెప్పుడున్***

అమలిన రూపయౌవన శుభాకృతులై పొలుపారు నట్టి ఉ
త్తమ రమణీమణుల్ హృదయ తామరసంబున నిల్చియుండ్రు; సం
యమనము మై తదీయరుచిరాకృతులన్ గనుటొప్పు గాని యీ
అమిత విజృంభణంబు లబలా! తగునా సుజనాళి కెప్పుడున్.

సుజనులు సౌందర్యమూర్తులైన రమణుల అందచందాల్ని సుకుమారంగా దర్శనాదులచే ఆరాధించాలి కాని విజృంభింపరాదు గదా!

## శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

***బారులె శరణ్యములు వేద పండితులకు.***

కలియుగంబున వేంకటాచలము నందు
స్వామియే పరదైవమై వరలు కతన
వచ్చి దర్శించి పోషించు భక్తవరుల
బారులె శరణ్యములు వేదపండితులకు

భక్తుల సమూహాలు స్వామివారికి సమర్పించే కానుకలు వేదపండితుల పోషణకు మూలభూతాలు. "బారులు" అంటే సమూహాలు అనే అర్థం ఇక్కడ స్వీకరింపబడింది.

## శ్రీ ధనకుధరం సీతారామానుజాచార్యులు

**కొక్కొరొకో యటంచుఁ గడుఁ గూయఁదొడంగెను కాకలొక్కటై**

తక్కుచు నుండె చీఁకటులు; తన్మయతన్ పొదలించు సృష్టి స
మ్యక్కలితాత్మయై యినుని యాగమనంబును కోరుచుండె; నీ
యెక్కటి నిద్రవీడనది యెందుకు కూయుచు నుండె కోడి తాఁ
గొక్కొరొకో యటంచుఁ; గడుఁగూయఁదొడంగెను కాకులొక్కటై

గాఢ నిద్రాపరవశుఁడైన ఒకానొకఁడు వేకువన నిద్రాభంగం చేసే ప్రకృతి మార్పుల్ని, పక్షుల్ని ఇలా నిందిస్తున్నాడు.

## శ్రీ పాలపర్తి శ్యామలానందప్రసాద్

**వ్యాఘ్రకులము మెసవదొడఁగె పంచాస్యతతిన్**

శీఘ్రగతి మాంసవాసన
లాఘ్రాణించుచును, నిద్రయందున్నను మూ
ర్తిఘ్రాణంబు రహింపఁగ
వ్యాఘ్రకులము మెసవదొడఁగె పంచాస్యతతిన్

పులులు నిద్రావస్థలో ఉండే సింహాల్ని చంపి భుజిస్తున్నాయి.

## శ్రీ E. S K. హరనాథ్ బాబా

**వాఘ్ఝరి ముంచి తేల్చఁగల వానర రూపుఁడవందు మోహనా!**

ద్రాఘ్ఝరిణీప్రవాహములు దాత్తముగాగ నొసంగు భారతిన్
ప్రాఘ్ఝషలాంఛనానుభవ సంకలితంపు కవిత్వ వైఖరుల్
ప్రఘ్ఝరి సత్కృతుల్ మిగుల స్వాంతము నందున నొప్పుచుండఁగా
వాఘ్ఝరి ముంచి తేల్చఁగలవా! నరరూపుఁడవందు మోహనా!

అవధానికి పై పద్యం ప్రశంసాపూర్వకమైంది.

## శ్రీ వై. రాజశేఖర్

***అలలపయిన్ రచించె నొక యద్భుత శిల్పము; శిల్పి యెవ్వఁడో!***

చలితమనస్కుఁడై వివిధ సంగతులన్ జరియించు క్రూరుఁడై
మెలఁగెడి ఒక్క దుర్మతి నిమీలిత నేత్ర పరీత నిశ్చలా
కలిత సమగ్రదీక్షమెయి కానఁగవచ్చుట కేమి హేతువో!
అలలపయిన్ రచించె నొక యద్భుత శిల్పము, శిల్పియెవ్వఁడో

నిత్యచాంచల్యమాన మనస్కుడైన ఒకానొక దుర్మార్గుని తపోబల సంపన్నుఁడుగా మార్చిన మహనీయుండెవరోగాని అలలపై అద్భుత శిల్పం సృష్టించినట్లు చేశాడు.

## శ్రీ కొల్లిపర వరసాయి శివప్రసాద్

***మీసము లేని మోహనుఁడు మీసముఁ ద్రిప్పెను రాత్రి వేళలన్***

భాసుర భావనా బల శుభంకరలీలలు దైవదత్త సం
ధానముదంచితోల్లసిత తన్మయతన్ గలిగింప; గాఢని
ద్రాసముపేతుఁడై పటుతరస్ఫురణోన్నతి స్వప్న వీధిలో
మీసము లేని మోహనుఁడు మీసము ద్రిప్పెను రాత్రి వేళలన్

## శ్రీ యం. వి. సత్యవతి

***రాముఁడు కాముఁడయ్యెగద రక్కసి శూర్పణఖన్ దలంచుచున్.***

ధీమహితోజ్జ్వలద్బలము దివ్యగుణాశ్రయమై తలిర్చుచో
నోముట మాని; నాటకవినూత్నగతుల్ పరికింపలేక, సం
భ్రామితుఁడయ్యె ప్రేక్షకుఁడు, భావజవంచిత చింతనాగుణా
రాముఁడు కాముఁడయ్యెగద రక్కసి శూర్పణఖన్ దలంచుచున్.

నాటకం చూస్తున్న ఒకానొక ప్రేక్షకుఁడు మన్మథపీడితుఁడై శూర్పణఖ వేషధారిపై మనసు పడ్డాడు.

## శ్రీ ఎ. వి. వి. రామరాజు

***వనిత వివాహవేళ నొక బాలుని గన్నది పెండ్లి పీటపై***

తన హృదయాంతరంబున నితాంతమనోహర మూర్తిమంతుఁడై
యెనయు ప్రియాకృతిన్ గడు వహించెడి పుత్రుని పొందగోరె భా
వనమున నట్టి సామ్యమున భాసిలు చుండెను బిడ్డ అయ్యెడన్
వనిత వివాహవేళ నొక బాలుని గన్నది పెండ్లి పీటపై

ఒకానొక వనిత తన భర్త లాంటి పుత్రుణ్ణి పొందాలనే ఆలోచనతో అదే సామ్యం కలిగిన ఒక బాలుని రూపాన్ని పెండ్లిపీటలపై నుండి చూచింది. "కన్నది" అంటే ప్రసవించినది అనే అర్థంకాక "చూచినది" అనే అర్థంతో ప్రయోగింపబడింది.

## శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి

***దుష్ప్రాప్యంబని తల్లడిల్లె సతి పుత్రుండట్లు జన్మింపఁగన్.***

దుష్ప్రేమంబు వహింపఁజేసె ముని వంద్యుండయ్యు నాకీగతిన్
దుష్ప్రాంతంబగు గేహమింక నను బంధుల్ సైతమున్ మెత్తురే
దుష్ప్రత్యక్షముగా నినుం డిచట పుత్రున్ నాకిడెన్ అక్కటా
దుష్ప్రాప్యంబని తల్లడిల్లె సతి పుత్రుండట్లు జన్మింపఁగన్

కన్యగా నున్నప్పుడే పుత్రోత్పత్తి జరగడం కుంతికి బాధాకరమైంది.

## శ్రీ జి. ఎల్. ఎన్. శాస్త్రి

***రాముని సతి నంది నెక్కి రావణు జంపెన్.***

ఓమెన్ మారుతి యేసతి
భీముండే వాహనమున వెలుగు విభవుఁడై
రాముం డెవ్వని జంపెను
రాముని సతి; నందినెక్కి; రావణు జంపెన్
పై సమస్య క్రమాలంకారంలో పూరింపబడింది.

## శ్రీ ముదిగొండ శివరామకృష్ణ శాస్త్రి

**మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్.**

మూర్తీభూత సమస్త ధీవిలసితస్ఫూర్తిన్ వనేజాక్షుఁడున్
వర్తించెన్ నరుగావ, సైంధవు నశింపంజేయ ధర్మంబు ని
ర్వర్తించెన్ తిమిరంబు వీడ, పటుచక్రప్రాకటారూఢితో
మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్

శ్రీకృష్ణుఁడు సైంధవవధార్థం ఆకాశంలో క్రమించిన తిమిరాన్ని చక్రంతో ఛేదించాడు. వెంటనే సూర్యప్రకాశం జాజ్వల్యమానమై మధ్యాహ్న వేళలో సూర్యోదయం లాగా కన్పట్టింది.

## శ్రీ కె. మురళీకృష్ణ

**సీతకుఁ బుట్టె లక్ష్మణుఁడు శ్రీ రఘురాముఁడు సంతసింపఁగన్**

చేతనముల్ నిరంతరము శిష్టగుణోచిత ధర్మయుక్తమై
ప్రాంతిగ నొప్పుచుండుటఁ బ్రభాతమునన్ జలజాప్తుఁగొల్వఁగా
ప్రీతిగ నెంచె జానకి; పవిత్రగుణాకరమైన ఊహ ఆ
సీతకుఁబుట్టె; లక్ష్మణుఁడు, శ్రీ రఘురాముఁడు సంతసింపఁగన్

ఉదయకాలంలో సూర్యభగవానుణ్ణి ఉపాసించాలనే భావన సీతకు కలిగింది. అందుకు లక్ష్మణుఁడు, రాముఁడు సంతోషించారు.

## శ్రీ ఇ. బి. హేమంతకుమార్

**కూడు పెట్టు వాఁడు కుత్సితుండు.**

ఆర్ద్రగుణము వీడి ఔచిత్యదూరుఁడై
రసనిమగ్న హృదయ రసన లేక
కేవలమ్ము పట్టి కీర్తికాంక్ష కొరకు
కూడు పెట్టు వాడు కుత్సితుండు

ఔదార్యంతో కాకుండా కేవలం కీర్తికాంక్షతో అన్నదానం చేసేవాడు కుత్సితుఁడేగా!

## శ్రీ కొమాండూరి రంగనాథాచార్య

***అరుణు కోరి మూటికొరకై పదకొండున కంగలార్చెడిన్.***

మారు కథా కలాపములు మాటికి మాటికి భావనంబులో
నూర, ఖగోళశాస్త్రవిదుఁడొక్కఁడు మిత్రుని తోడుతన్ చమ
త్కారము తోపఁగాఁ బలికె, కావలె పెండిలి యంచు నీగతిన్
అరుణు గోరి, మూటికొరకై, పదకొండున కంగలార్చెడిన్

## శ్రీ డి. చంద్రారెడ్డి

***ఇందునిభాననల్ నుదుట యించుక బొట్టును పెట్ట నేఁటికిన్.***

హైందవ ధర్మమర్మమున కాస్పదమైఁ విలసల్లలాట సీ
మం దులకింపఁగాఁ బొడలు మాన్యతబోన్నతి బాలభాను దీ
ప్తిం దనరారు భంగి కడుఁ బెద్దగ బొట్టును పెట్టుచుందురో!
ఇందునిభాననల్ నుదుట యించుక బొట్టును పెట్ట నేఁటికిన్

## శ్రీ కోగంటి వీర రాఘవాచార్యులు

***భార్యకు మీసముల్ మొలిచె బాపురె! భర్తకు గర్భమయ్యెడిన్.***

అర్యులు సెప్పు ధర్మములు నార్షగుణోచితమైన పద్ధతుల్
కార్యగుణ స్వరూపమును గాంచుట మానుచునుండె; జీవహృత్
శీర్యదుదీర్ణమాధునిక జీవనశాస్త్రపు జృంభణంబుగా
భార్యకు మీసముల్ మొలిచె; బాపురె! భర్తకు గర్భమయ్యెడిన్

ఆధునిక శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెందుతూ సతులకు మీసాలు రావడం, భర్తలు గర్భం ధరించడం జరుగుతూ ఉన్నట్లుంది.

## శ్రీ కుందుర్తి సత్యనారాయణ

### *అన్నులమిన్న చన్నుగవ యందల మెక్కె నిదేమి చోద్యమో!*

పన్నగ ధారుణీతలముపై ఒక వింత లభించినట్లు సం
పన్నుని అండదండలకు పాత్రత గల్గెనటంచు వేశ్య తా
నెన్నక యుండె పూర్వగతి నించుక యేని మదాంధకారయై
అన్నులమిన్న చన్నుగవ అందల మెక్కె నిదేమి చోద్యమో!

ఒక సంపన్నుని అండదండలు లభించినందులకు వేశ్య మిడిసిపాటు పై పద్యలో వర్ణింపబడింది.

## శ్రీమతి చోళవరపు మాణిక్యము

### *కాయని కాయ ఫలమ్మగున్ గదా!*

ఆయత పాండితీబల సమంచిత చంచదుదాత్త భావరే
ఖాయుతుడై కవీశ్వరుడఖండవచోగతి రాజసన్నిధిన్
పాయని వాదనాబలము భాసిలజేయుచు కీర్తికాంతులన్
కాయగజేయ దిక్కుల సుకాయనికాయ ఫలమ్మగున్ గదా!

సత్కవీశ్వరుడు తన పాండితీబలముతో రాజులను మెప్పించి కీర్తి శరీరుడవుతాడు.

## డా॥ సూరం శ్రీనివాసులు

***కాకరకాయ మామక నమోఽస్తని చుక్కలతోడు పల్కెడున్.***

నీ కథనా పటుత్వకమనీయత నెన్నఁడరంబె? దుష్టహృత్
భీకర! యంచు సూర్యుఁడు పదింబది సంస్తుతిఁజేసె శ్రీహరిన్
ప్రాకట దివ్యమంగళ విభాకరరూపమయా! సమస్తలో
కాకరకాయ! మామకనమోఽస్తని చుక్కల ఱేడు పల్కెడున్.

సూర్యచంద్రులు శ్రీహరిని ప్రార్థిస్తున్నారు. సమస్తలోకములకు ఆకరమైన (నిలయమైన) వాడుగా భావించి హరిని చుక్కల రేడు (చంద్రుఁడు) ప్రార్థిస్తున్నాఁడు.

## డా॥ యం. కృపాచార్యులు

***చంద్రమతిన్ వరించె మునిచంద్రుఁడు మోక్షపథానుగామియై***

సాంద్రతపోబలోన్నతియు, సంయమనానుభవప్రభావని
స్తంద్రవిభాప్రపంచమును స్వాంతము నందున వెల్గుచుండఁగా
మంద్రగభీరచిత్తమున మార్దవమొప్పఁగ శైత్యభాస్ఫురత్
చంద్రమతిన్ వరించె మునిచంద్రుఁడు మోక్షపథానుగామియై

సంయమనభరితమైన చాంద్రీ స్వచ్ఛమైన నిర్మలాంతరంగాన్ని మునివర్యుడు కోరుకున్నాడు. 'వరించు' అనగా 'కోరుకొను' అనే అర్థం ఇక్కడ స్వీకరింపబడింది.

## శ్రీ సిహెచ్. రామేశ్వర శర్మ

***కాకరపూలు పూచి తెగకాసెను కమ్మని నిమ్మకాయలన్.***

పోకడ బాల్య సంస్కృతుల బుద్ధి గుహాంతర సీమ నింపఁగా
ఆకరణిన్ పొనర్చుటకు నాత్మము చంచలతన్ వహించె; దీ
పాకరవేళ నింపె ప్రకటార్చుల వేగమ నిమ్మకుప్పలన్
కాకరపూలు పూచి తెగకాసెను కమ్మని నిమ్మకాయలన్

ఒక రైతు ఇంటిలో నిమ్మకాయలు కుప్పలు కుప్పలుగా పోసి యున్నారు. బాల్య చాపల్యంతో ఆ రైతు బిడ్డ నిమ్మకుప్పలపైన కాకరపూలు వెలిగించడం ప్రారంభించాడు. అది దీపావళి దినం కాబట్టి.

## శ్రీ అంబడిపూడి చంద్ర శేఖరశాస్త్రి

*పువ్వులు గందకుండ రసముల్ గొను తేటుల వంటి నేర్పునన్.*

ఎవ్విధి బోధసేసినను ఇంచుకయైన నెరుంగ రాక్మలన్
మవ్వపులీల నీ మధువనంబున నుండు ఫలంబులెల్ల బల్
రువ్వుచు నుండనేల రుచి రూఢిగఁ గ్రోలెడి లీల సేయుఁడీ
పువ్వులు గందకుండ రసముల్ గొను తేటుల వంటి నేర్పునన్

శ్రీరాముఁడు వానరసైన్యంతో అంటున్నాడు. "పువ్వులు కందకుండ అందులో ఉండే మకరందాన్ని ఆస్వాదించే తుమ్మెదలలాగా ఈ మధు వనంలో ఉండే పండ్లని ఆస్వాదించండి" - అని.

## డా॥ ఆకురాతి పున్నారావు

*ఏనుఁగు నెదిరించి పోరి యెలుక జయించెన్.*

మానిత గణేశు వాహన
మానె చనవు పేర్మి బహుపదార్థంబుల ను
గ్రానసము లేని మస్తపు
టేనుఁగు నెదిరించి పోరి యెలుక జయించెన్

వినాయకుని వాహనమైన ఎలుక స్వామిః దగ్గర చనవుకొద్దీ విపరీతంగా బహుపదార్థాలు భుజించింది. ఆ ఆనందంలో స్వామినే ఎదిరించింది. స్వామి ఆశ్రిత ప్రసన్నుడు కాబట్టి దాని జయాన్ని మన్నించాడు.

## శ్రీ వంగల కేశవశర్మ

***కుక్కకు నక్క బుట్టె కవి కుంజర! కుంజర మేల పుట్టదో!***

ఎక్కటి ధీబలోద్ధతిని ఏపు వహించె, మహోన్నతంబుగా
అక్కట రాజ రాజ, తని కాత్మజుఁడయ్యెను లక్ష్మణుండు స
మ్యక్కలితంబు గాదిది; యథార్థము నారయ, ఘోరకాలపున్
కుక్కకు నక్కబుట్టె కవి కుంజర! కుంజర మేల పుట్టదో!

రాజ రాజైన సుయోధనుఁడు కాలభైరవ సదృశవిక్రముఁడు. అతనికి నక్క వంటి లక్ష్మణకుమారుఁడు జన్మించాడు గదా!

## శ్రీ అరవపల్లి దత్తాత్రేయశర్మ

***రాజె తరాజుగా నవతరం బవతారముఁదాల్చె నీయెడన్.***

రాజిత రాజధర్మములు రమ్యత వీడెను; సొంపుదప్పె సం
యోజనముల్, సమన్వయము నొందక యుండెను, చిత్తవృత్తుల్
ఆజిగ నొప్పె జీవరభసాన్వితమైన సమస్త యత్నముల్
రాజె తరాజుగా నవతరం బవతారము దాల్చె నీయెడన్.

రాజసదృశులైన వాళ్ళంతా తరాజులౌతూన్నందువల్ల సమకాలీనంలో సత్యసంగతమైన సమన్వయం లోపిస్తూ ఉంది.

## శ్రీ ఆకుల వెంకటేశ్వరరావు

***తల్లికి మిండగాఁడనుట తథ్యమ! ఆతని గొల్వ న్యాయమా!***

ఫుల్ల సరోజ నేత్రకడ పోడిమి సూపఁగ వచ్చె వృద్ధుఁడౌ
కల్లరి; భోగభాగ్యములు కల్గఁగఁజేయు తలంపు లేక ఉ
ద్యల్లలితాత్మతన్ వదలి యారటి వెట్టెను ప్రౌఢ వేశ్యకున్
తల్లికి మిండగాఁడనుట తథ్యము! ఆతని గొల్వ న్యాయమా!

ఒక యౌవనవతియైన వేశ్య యొక్క తల్లికి విటుఁడైన వాడు సహజంగా వృద్ధుఁడై ఉంటాడు. అటువంటివాణ్ణి జవ్వని అంగీకరింప గలదా?

## శ్రీ యం. జనార్దనశర్మ

***ఆంధ్రులు భారతావని సమైక్యము కోరరు దేశభక్తులై.***

ఇంద్రదివిలోలవై భవ సమీక్షితమై జనతాప్రభుత్వ ని
స్తంద్ర గతుల్ సమస్తమును దార్కొను చుండఁగ వీడి కాంగ్రెసున్
సంద్రముగా గ్రహించి రదె సర్వము నొప్పఁగ పొంది రన్యమున్
ఆంధ్రులు భారతావని సమైక్యము కోరరు దేశభక్తులై

భారతదేశం సమస్తం జనతాపార్టీ గెలిస్తే, ఆంధ్రులు అప్పుడు కాంగ్రెస్‌నే ఎన్నుకున్నారు. దేశమంతా మళ్ళీ కాంగ్రెసును గెలిపిస్తే ఆంధ్రులు తెలుగుదేశం పార్టీని గెలిపించారు.

## శ్రీ మాడభూషి నరసింహాచార్యులు

***మధ్యాహ్నంబునఁ దోచెఁ జుక్కలు నభోమధ్యంబునన్ సత్కవీ!***

సాధ్యాసాధ్యవిచక్షణా రహితుఁడై క్ష్మానాథుఁడున్, సత్కవీట్
స్వాధ్యాయాభ్యసన క్రియల్ గనక యాజ్ఞాపించె నేతత్క్రియా
రాధ్యుండైన కవీశుఁ డీక్షణములన్ రాజిల్ల తత్ ధ్యాసతో
మధ్యాహ్నంబున తోఁచెఁ జుక్కలు నభోమధ్యంబునన్ సత్కవీ!

మహారాజు ఆదేశంతో కావ్యప్రపంచ నిర్మాణధ్యాసలో ఉన్న సత్కవి భావనా జగత్తులో మధ్యాహ్నకాలంలో ఆకాశంలో చుక్కలు తోచాయి.

## శ్రీ జంధ్యాల జయకృష్ణ బాపూజీ

***ధవునిన్ ద్రౌపది తన్నె మూతి పగులన్ ధర్మప్రకారంబుగన్.***

అవిధేయంబు వహించి దుష్టమతివై అస్మత్ సతీరత్నమున్
కువికారంబుగ నొంపజూచెదవురా! క్రూరాత్మకా! దుష్టసైం
ధవ; నిన్ దన్నెద నంచు భీముఁడన చింతాక్రాంతుఁడౌ దుస్సలా
ధవునిన్ ద్రౌపది తన్నె మూతి పగులన్ ధర్మప్రకారంబుగన్

దుష్టమతి, దుస్సలాధవుడు నైన సైంధవుని మూతి పగులునట్లు ద్రౌపది తన్నడం ధర్మప్రకారమే.

## శ్రీ మల్లాది శ్రీహరిశాస్త్రి

***పతిని సహోదరా! యనుచు పార్వతి పిల్చెను భారతంబునన్.***

సతత సమగ్రరూపబల సంకలితోన్నత సత్యధర్మ సం
గతులకు నాలవాలమయి కానఁగవచ్చెడి విష్ణుమూర్తి న
ద్యతగతిమై హృదంతరము నందున నిల్పి నుతించి యిందిరా
పతిని సహోదరా! యనుచు పార్వతి పిల్చెను భారతంబునన్

ఇందిరాపతియైన విష్ణుమూర్తిని పార్వతి సోదరా! యని సంబోధించడం భావ్యమేగదా!

## శ్రీ జన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి

***చంద్రుని ముద్దుపెట్టుకొనె జానకి కోర్కులు సందడింపఁగన్.***

మంద్రమనోజ్ఞమై, హృదయ మానిత రాగము లొప్పఁగా, శరత్
చంద్రికలన్ పెలార్చు మృదు సంగతహాస విలాస పైఖరుల్
సాంద్రములయ్యె, సూర్యకులసాగరసంభవుఁడైన యట్టి రాట్
చంద్రుని ముద్దు పెట్టుకొనె జానకి కోర్కులు సందడింపఁగన్

సూర్యకులసాగరచంద్రుఁడైన శ్రీరామచంద్రుని సీతాదేవి చుంబించింది.

## శ్రీ బి. ఏ. లింకన్

***రణమున గూల్చె రాముని పరాక్రమ హీనుఁ డొకండు నిర్దయన్.***

ప్రణయతపః ప్రసన్న గుణ బంధుర మూర్తి రఘూద్వహుండుగా
గణుతి యొనర్పఁ జాలక వికారమతిన్ రజకాధముండు మా
ర్గణముల వంటి మాటల ధరాసుత జీవన మాధురి న్నకా
రణమునఁ గూల్చెరా! ముని! పరాక్రమహీనుఁ డొకండునిర్దయన్

ఒక రజకాధముఁడు అకారణంగా సీతా జీవనమాధుర్యాన్ని భగ్నం చేశాడు గదా!

## శ్రీ బండ్లమూడి సత్యనారాయణ

***దున్నను గని కన్నుగీటె తొయ్యలి అహహా***

మన్నన సేయుచు శృంగా
రోన్నత రస హావ భావ యుక్తాకృతియై
చెన్నుగ నొక మందిరమం
దున్నను గని కన్నుగీటె తొయ్యలి యహహా!

అందున్ + నను = అందున్నను.

**అప్రస్తుత ప్రసంగములు.**

1. శ్రీ సాంధ్యశ్రీ
2. శ్రీ గద్దె వీరరాఘవయ్య
3. శ్రీ మన్నవ గిరిధరరావు
4. శ్రీ పి. యస్. దత్తప్రసాద్.

వీరి చమత్కార ప్రశ్నలకు తగిన చతుర రీతిలో సమాధానములు చెప్పబడినవి.

**అశువులు** : ప్రేక్షకులలో మంది నలుగురికి కోరిన అంశములపై పద్యములు చెప్పబడినవి.

మొత్తము 108 మంది పృచ్ఛకులకు వారు కోరిన అంశములు పరిపూర్ణ తృప్తికరముగా చెప్పబడి, ధారణచేసి పునరుద్ఘాటన చేయ బడినవి.

## ప్రశంస

*'తెనుగులెంక' శ్రీ తుమ్మల సీతారామమూర్తి*

అప్పుడు బట్టుమూర్తి మొదలైనకవుల్ బుజమప్పళించినా;
రిప్పుడు మేడసాని సిడమెత్తె వధాన విధాన చాతురిన్
ముప్పిరిగొన్న మోదమున మోహనుపైఁ దెఱగంటితోఁటపూల్
గుప్పి రయారె! యంచు సరికొండ మనీషియు మాడభూషియున్

అవిరతరాజకీయసమ రాంకితజీవితమై నలంగుచున్
నవయుజనమ్ము సమ్మదసనాథము కావలెనన్న సాహితీ
ప్రవణము కావలెన్, గళలపట్ల మమత్వము నేర్చుకోవలెన్
కవులకుఁ జుట్టమై మెలఁగఁగావలయున్ గనువిప్పఁగావలెన్.

## మన మేడసాని

*డా॥ కరుణశ్రీ*

శ్రీమాన్ పద్మావతీనాథః స్వామీ సప్తగిరీశ్వరః
శ్రీవేంకటేశ్వరః పాయాత్ మోహనం విశ్వమోహనమ్

తిరుపతి వేంకటేశ్వరులు, ధీరులు కొప్పరపుం గవీశ్వరుల్
సరసులు కాశికృష్ణ కవిచంద్రులు, విజ్ఞులు పూర్ణప్రజ్ఞు లిం
దరు-మరి కొందరున్ శతవధానసరస్వతికిన్ మనోజ్ఞమున్
కర మరుదైన సౌధమును గట్టిరి ఏబదియేండ్ల క్రిందటన్

అల తొలినాటి "గర్తపుర" మందలి చక్కని మేడలోని ప
ల్కుల దొరసాని నిప్పు డనుకొందురు కొందరు "మేడసాని"గా
పలుకు వెలంది "మోహనశుభాకృతి" దాల్చి శతావధానమున్
సలిపెను మేడమీది కలశాలకు బంగరునీరు పోయుచున్!

కులపతి కృష్ణుడై కూర్చుండి నాగలపై
సారథ్యకృత్యమ్ము సలిపె నేడు;
వీరాధివీరుడై విజయవిహారుడై
మేడసాని పరాక్రమించె నేడు;
సరస సదస్సుల జయజయ ధ్వనులతో
శతవధాన రథంబు సాగె నేడు;
సమ్మోహనాస్త్రమ్ము సంధింప సభ్యులు
పారవశ్యము నందినారు నేడు;

చక్కదనమున కొకవింత చక్కదనము
జాణతనమున కొక నెరజాణతనము
కమ్మదనమున కొక మంచి కమ్మదనము
కళల కొక క్రొత్త కళ వచ్చె గర్తపురిని

సంధ్యాప్రసటన్మహేశ్వర శిరస్సంభ్రమ
గంగా తరంగశీకరము లనగ,
శ్రీ రఘుస్వామిపై సీతమ్మ పోసిన
మేలి ముత్యపు తలంబ్రా లనంగ,
వర్షాగమమున పర్వతసానువుల నుండి
జలజల దుముకు నిర్ఝరము లనగ
త్రాళ్ళముళ్ళను విప్ప తల్లుల పాల్ ద్రావ
దౌడు తీసెడు లేగదూడ లనగ

వెంటవెంటనె గాండీవి వింటి నుండి
బయలుదేరెడు శర పరంపర లనంగ
పద్యపాదాలు నీనోట పరువులెత్తు
ఆశుకవితావిహార! మోహన కుమార!

దీవించినారులే! తిరుపతి వేంకటే
శ్వరులు నీ మోహనశైలి గాంచి;
కొనియాడినారులే! కొప్పరపుం గవీ
శ్వరులు నీ ఆశుపైఖరిని జూచి;
మది మెచ్చెలే! నీదు పదగుంఫనల గని
వేలూరి శివరామ విబుధవరుడు;
దిగివచ్చెలే! నిన్ను తిలకింప మింటి చు
క్కలును విద్యుద్దీపములుగ మారి;

నచ్చి నీ కమ్మదనమును మెచ్చుకొనియె
అపర సూతమహర్షియౌ త్రిపురనేని;
నేటి అవధాన కవితలో సాటిలేని
మేటి "రసరాజధాని" మా "మేడసాని"

"అల్లసాని" సాని అలనాడు నొప్పించె
వేదవేత్త నొక్క విప్రవరుని;
"మేడసాని" వాణి నేడు మెప్పించెను
వేలకొలది సత్కవిప్రవరుల

"అల్లసాని" సాని అల్లరిపిల్లయై
మంచు మలల సంచరించె నాడు;
"మేడసాని" వాణి మెత్తనిపిల్లయై
మంచి సభల సంచరించె నేడు.

మోహినీ కటాక్ష మోహనాస్త్రాలకు
సొలసి సోలి రపుడు సురలసురులు;
మోహనుని కవిత్వ మోహనాస్త్రాలకు
పరవశించి రిపుడు ప్రాజ్ఞవరులు

పంతులయ్య పలకపైన వ్రాసిన "ఉప్పు
కప్పురమ్ము" నొప్పజెప్పలేము;
నూరు గంటములకు నూరు పద్యమ్ములు
జెప్పి-త్రిప్పి-అప్పజెప్పె నితడు

మేడసాని వాణి వాడవాడల కెక్కె;
మేడసాని కవిత మేడలెక్కె;
ఆశుకవిత క్రొత్త అందాలు ధరియించె;
మోహనుండు విశ్వమోహనుండు

మీ సము లుండిన గాదా
మీసము లుండుట కటంచు మీరందురొకో!
బాసల భారతి యగుటను
మీసమ్ములు దేనికంచు మేమందుములే!!

## జమ్ములమడక మాధవరామ శర్మ

### మహోపాధ్యాయ, దర్శనాచార్య, అభినవభారతి

అవధానముల చూచితిని. అష్టావధాన భావనచేసితిని శతావధానుల చూచితిని. సహస్రావధాన మెరుగుదును. ఇట్టివి చిత్రకవితావధానము లగునని నా అధీతము లవగతములు నాకు నేర్పినవి. పాండిత్యము కవిత్వము పురాణభట్టత కృషివైశిష్ట్యము భాగవతభావులకు వలయు ధర్మమని నాలో నేను భావింతును. వ్యుత్పత్తి కలిమి, వర్ణనాచతురత, గూఢార్థ నివేదనము, విద్యావిశేషవిశిష్టత, పరాప్రతిభా వైదగ్ధ్యము, శ్రీమోహన జనర్భాగ్యము. సర్వత్ర వైదగ్ధ్యము పాండిత్యాద్వైతముతో నుండుట నా ధర్మాద్వైతమున మోహనా శ్రయముగా నుండుట నాకు శ్రవణః ప్రీతి.

ధర్మార్థకామమోక్షముల  దండ సామం
జస్యము చౌధురి స్వభావము.  త్య చాతుర్య
చతురశ్ర శోభ చౌధురికిం ను  ఖగు గావుత.
భావుకు శ్రోతృభ్రాతల చాతు  ర్లలితత్త్వము,
ఉదాత్తతలను చమత్కారము  సహృదయ
శ్రోత లిట్టివానిలో నలవడిరి.  రు. సమాను
లుందురు. కొందరు తృతీయప్ర  ను గిచ్చెదురు.
కల కలముతో దంతకాంతులు  గాధికుల తుష్టి
మోహను పుష్టి. సమభావనలో  భావింతును.
న్యూనతారహితులను ఆత్మను  మరి గుర్తింప
గలరు.

ఒకనాటి శతపద్యపద్యా స  లువదాయను
సంశయపరీతు లయిరి. మోహన  నీకు వలదు.
స్వయం సంపూర్ణములగు ము  సంగతములు.
అభిజ్ఞప్రశంసలను వక్రోక్తిస్పంద ప్రస్పందితము లగునట్లుపయోగింపుడు.
మోహన హృదయా! హృదయబలమున నవావధాన విధాన మవలంబిం
చుట యుక్తమని నా చేతమున నున్నది. కవికంఠాభరణము, విదగ్ధముఖ
మండనము, ఈశ్వర శతకము, దేవీ శతకము ఇత్యాదులను మరల నను
సంధానింపుడు.

భాషామిశ్ర - అక్షరముష్టికము - బిందుమతి - ప్రహేళిక-క్రియా
గుప్తము-అక్షరానుసంధానము విభక్త్యాభాసము-శాస్త్రకవిత-ఈ దృశముల
సమీక్షించి నవవిధానమున కూర్చుట నవవిధానము. పునర్నవ
విధానము. అస్తు

కావ్యావధానచాతుర్యం ధారణాభ్యాసపాటవం
ధ్యానసమాధిసంప్రాప్తం మోహనచౌధురీ తపః

# మధురానుభూతి

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం
తెలుగుశాఖ అధ్యక్షులు, నాగార్జున విశ్వవిద్యాలయము, నాగార్జున నగర్.

మేడసాని మోహన్‌గారి శతావధానం మూడోరోజు సమావేశానికి అధ్యక్షతవహించే మహావకాశాన్ని, డాక్టర్ ప్రసాదరాయ కులపతిగారు నాకు కల్గించారు. అది నాభాగ్యంగా భావిస్తాను. అందుకు వారికి నా కృతజ్ఞత లెల్లప్పుడూ ఉంటాయి.

అది పతాక సన్నివేశం. రెండు రోజులుగా సమస్యలు, దత్తపదులు, వర్ణనలు రెండేసి చరణాలు పూర్తి అయినాయి. ఇప్పుడు శేషాన్ని పూరించి, పద్యమంతా ధారణచేసి చెప్పాలి. ఒక్కొక్క పూరణం అలవోకగా కావించి చెప్తుంటే సభ్యులు, పృచ్ఛకులు ఆనందాతిరేకంగా కరతాళధ్వనులతో 'ఆహా! ఆహా!' అంటూ తమ పారవశ్యాన్ని ప్రకటించటం ఆలకించే ఆనందోత్సాహం నాకు లభించింది.

మేడసాని మోహనుని వినయవినమితత్వం నన్నుముగ్ధుడ్ని కావించింది. ఆతని ధారణ, ధార అదేదో మహత్తరమైన అపూర్వ పూర్వజన్మసుకృత మనిపించింది. తెలుగు భాషపట్ల, తెలుగుపద్యంపట్ల ఆదరణ సన్నగిలుతున్న ఈ రోజుల్లో, తిరిగి అభిమానాన్ని పునరుజ్జీవింపజేయటానికి అవతరించిన కారణజన్ము డనిపించింది. ఎప్పుడో వేలూరి శివరామశాస్త్రిగారు, తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులు శతావధానాలు చేశారని వినికిడి. అవి ఇలా జరిగాయా? ఏమో!!

ఇది వినుకలి, కనుకలి కూడా. గుంటూరు సాంస్కృతిక చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగింది. ఈ అష్టోత్తరశతావధానం వైవిద్య విలసితమైంది. ఇందులోని పద్యపూరణలు అక్లిష్టమనోహరశైలీ విన్యాస విలసితాలు. కొన్ని క్లిష్ట ప్రాససంఘటితాలు అయినా అవధాని గారికి నల్లేరుపై నిబండి నడకే గావటం ఆశ్చర్య జనకం. మారుమూల వృత్తాల్నిగూడా సామాన్య వృత్తాలుగానే అవలీలగా నడిపించిన అవధానిగారి ప్రతిభ అసాధారణం, అనిదంపూర్వం, ఉదాత్త మధురానుభూతి కాలవాలం.

# మోహన శతావధానం

*డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు*

తెలుగుశాఖ అధిపతి, బెంగుళూరు విశ్వవిద్యాలయము

చిన్నప్పుడు మా అమ్మగారు పని తొందరలో వున్నప్పుడు "అబ్బబ్బ! అష్టావధానం శతావధానం అయిపోతోంది!" అని విసుక్కోడం విన్నాను. కాని, నిజంగా అష్టావధానం, శతావధానం ఎలా ఉంటాయో చూడలేదు అప్పట్లో. తర్వాత 1964లో తిరుపతి యూనివర్సిటీలో రిసెర్చి చేసేటప్పుడు సి. వి. సుబ్బన్నగారి అష్టావధానం చూశాను. తర్వాత చాలా మంది పండిత మిత్రులు అష్టావధానాలు చేయడం మాత్రమే చూశాను. శతావధానం చూడలేదు. అయినా ఈ అష్టావధానుల్లో కొందరు తమపేరు చివరో, ముందో 'శతావధాని' అని తగిలించుకొనేవాళ్ళు. వీళ్ళు శతావధానాలు ఎక్కడ చేశారో ఆ దేవుడికే తెలియాలి! ఇటీవల శ్రీ మేడసాని మోహన్ శతావధానం చాలా పకడ్బందీగా సభారంజకంగా చేస్తున్నారని విని చూడాలని కుతూహలపడ్డాను. (మిత్రుడు డా॥ మల్లెల గురవయ్య ద్వారా వీరి ఆశు కవితాధారను గురించి ముందే వినివున్నాను) ఆ కుతూహలం గత జూన్ 27-29 తేదీలలో తీరింది. ఆప్త మిత్రులు డా॥ ప్రసాదరాయ కులపతిగారు నాకీ అదృష్టాన్ని కలిగించారు. శతావధానంలో నిజంగా వంద మంది పృచ్ఛకులుండరనీ, ఏదో 20, 30 మంది మాత్రమే ఉంటారనీ, ప్రశ్నలు కేవలం వర్ణనలకు మాత్రమే పరిమితమై ఉంటాయనీ, తిరుపతి వేంకటకవుల శతావధానాలు కూడా ఇలాగే జరిగేవనీ పెద్దలు చెప్పగా విన్నాను. కాని శ్రీనాథపీఠం వారు గుంటూరులో ఏర్పాటు చేసిన మోహన్‌గారి అద్భుత శతావధానంలో నా ఊహలన్నీ తలక్రిందుల య్యాయి....నిజంగా వంద కుర్చీలువేసి వందమంది పృచ్ఛకుల్ని కూర్చొబెట్టారు. వర్ణనలు 25 మాత్రమే ఉంచారు. 25 దత్తపదులూ, 50 సమస్యలూ చేర్చారు. మూడురోజులు మహత్తర సరస్వతీ యజ్ఞంగా నిర్వహించారు. అన్నింటినీ తరుణ మోహన్ అవలీలగా దాటివేశాడు. "ఓహో! ఒక గొప్ప కవితా సంప్రదాయం నిరాడంబరుడైన ఈ యువకుడిలో ఎంత

రహస్యంగా దాక్కుంది!'' అని నేను దిగ్భ్రమ చెందాను. ఎన్ని కవితా విప్లవాలూ, కాకరకాయలూ వచ్చినా సంప్రదాయంలో బలమైనది బ్రతికే వుంటుంది అనడానికి ఈ మోహన శతావధానం ఒక ప్రత్యక్షసాక్షి! శతావధాని ప్రతిభతోపాటు, ఒక గొప్ప సూత్రధారుడిలా దాన్ని నిర్వహించిన శ్రీనాథపీఠాధ్యక్షులు డా॥ ప్రసాదరాయ కులపతిగారి పాండిత్య దక్షత కూడా సభ్యుల్ని అడుగడుగునా అలరించింది....

## ప్రశంస

'కవిరత్న' 'కుమారసరస్వతి'
**యామిజాల పద్మనాభస్వామి**

శుభాశీస్సు

శ్రీవాణీగిరిజారూపా శ్రీవాక్సౌభాగ్యదాయినీ
మోహనం సతతంపాయాత్ శ్రీ మాతా భువనేశ్వరీ

౨

శతవధాన విధాన విజ్ఞానమూర్తి నిరుపమజ్ఞప్తిశక్తి సన్నిహితకీర్తి
ప్రకృతిమోహన వాక్ప్రభాభాసమాన! మోహనా! వర్ధిలుముయశఃపూర్ణశశిగ

౩

పలుకులరాణికిన్ కొమరు బ్రాయపు బిడ్డడవైతివీవు నీ
పలుకున ఆమె చిర్నగవు భావసుగంధవిలాస సంపదల్
సలలిత రీతి నింపుచునుసాకుచునున్నది నేనెరింగితిన్
ఫలమసమాన మొందితివి; ప్రాగ్జనిసత్కృతిమీర మోహనా!

౪

వాక్పయోధర ధారళపాతమౌచు
వెలయుచున్నది వీనుల విందుగాగ;
ఇట్లెసాగుత కలకాల మేకరీతి
మోహనా! ఆంధ్రజాతి సమ్మోహనముగ

ఉ

తలపించితి మాగురువుల
పలుకున పద్దెమున బదులు పలికెడిరీతిన్
విలసిల్లు మిట్ల తెరు వి
మ్ముల సొమ్ముగ! మేడసానిమోహనసుకవీ!

## శుభాశంసనమ్

*ముదిగొండ శివరామకృష్ణశాస్త్రి*
యస్. యం. ఓరియంటల్ కాలేజి, ఆకిరిపల్లి.

కులపతి శివమూర్తిం ధీరమాలోకయన్తం
కిమపి కిమపి చిత్తే నిశ్చలం భావయన్తమ్ ।
సరస కవి గణైస్తైః పండితైరావృతం, తం
మధుర విజయరూపం మోహనం భావయేఽహమ్॥

శక్త్యా, యుక్త్యా, ఽతమవిభవయా, చాద్వితీయోఽ, వధానీ
సద్యోహృద్యైర్గురులఘుయుతైశ్చారుగైః పద్యభాగైః ।
ప్రాజ్ఞంచైనం ధనపతిసఖం తోషయిత్వా ప్రసాదం
లేభేఽపూర్వం, శివకృతమహో గౌరవం, మోహనోఽయమ్ ॥

అవధానీ మేడసానీ మోహన స్సర్వమోహనః ॥
శ్రీనివాస కటాక్షేణ చిరంజీయాచ్ఛుభాన్వితః॥

## ప్రశంస

*శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు*

శ్రీనాధుండయి, తిమ్మరు
సై, నాకాధీశు సభ బృహస్పతి యగుచున్
వాణీ వీణా మృదు ని
క్వాణమ్ముల పలుకెసంగు కవి కులపతికిన్

అకలంక ప్రతిభావిశేషములచే నష్టావధానమ్ము నీ
సకలాంధ్రోర్విని నేలినట్టి ఘను నస్మద్గోత్రు శ్రీనాధ పీ
ఠకలాపైభవమెల్లఁ దానగుచు నింటన్ బైట రాణించు నా
శుకవీంద్రున్ మదిమెత్తు మా కులపతిన్ సోదర్య విద్వన్మణిన్

సరిగా నూర్వురు పండితోత్తములు ప్రశ్నల్ నిల్చివర్షింపఁ గుం
టురిలోనం బొనరించి మించె గురు లోహోయంచుమెచ్చంగ వే
లురి విద్వత్కవి శబ్దశాస్త్రనిధి యుల్లోలన్ మహాప్రజ్ఞ నా
పురి నీ విప్పుడు సేయుచుంటివి జనంబుల్ మెచ్చ మేల్ మేలనన్

సాతత్యంబుగ నీ మహాశుకవితా సంపత్తి భాసింప మా
చేతంబుల్ నవ హర్షమొప్ప వికసించెన్ సౌరభశ్రీల, న
ద్వైతీ మీకము నే వధానము బుధుల్ తాదాత్మ్యముం బొందిరో
యీ! తథ్యమ్మిది మేడసాని సుకవీ! యేపారు వేవేండ్లుగా

ధారణ తగ్గదు మతి వా
గ్ధోరణి యే కొంచెమేనిఁ గుంటు వడదు ని
స్సారమ్ముగా దొకింతయు
శారద నీకగుట పూర్వజన్మ సుకృతమౌ

తడబాటించుకలేక భావమును, సందర్భమ్ము శబ్దమ్ముఁ గూ
ర్చెడు నీప్రజ్ఞ సమస్త పండితుల హర్షింపంగఁ జేసెన్ బళా!
మెడసాన్వన్వయ మోహనా! నినుఁగడున్ మెత్తున్ మమున్ మించి పై
చెడు గంగార్ఝురి నాఁ దెలుంగు ప్రజ వాసించున్ మహాహ్లాదతన్

పిడుగులవంటి పండితులు పృచ్ఛకులెల్లరు నీ వధానమే
యెడ యెడమీని ధాటి యెలయించును నర్జును నస్త్రవైఖరిన్
పొడిపొడి మాటలేమిటికి పోడిమి మీర యొసంగుచున్న మా
యుడుగర నీ కవిత్వసతి కొప్పును గావుతఁ గంఠ సూత్రమై

## ప్రశంస

డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ M.A.Ph.D.
ఆంధ్రోపన్యాసకుడు, జె.కె.సి. కళాశాల, గుంటూరు.

తెలుఁగులదైన ప్రక్రియగఁ దేలి, విచిత్ర కవిత్వపాద పూ
జల విహరించు శారద ప్రసాదము లష్టశతావధానముల్
కలుగును కోటికొక్కరుఁడొకానొకడేడొ వధాని, వాని యం
దలి కవితా వధూటి వదనప్రభ తెల్లని తెల్గు తల్లియా.

అవధానప్రతిభావతీ ప్రణయగాఢాలింగనాసందనో
త్సవ సంప్రీత మనస్క! ప్రీణిత వచస్కా! నా నమస్కారముల్
వివిధ ప్రాశ్నిక పద్యవాద్య కవితాపేటౌక్షతల్ వేయఁగా
నవధానాంగన మోహనాంగనగ మోహన్! మారె సోఽహమ్మనన్

రసికుల వినోదమే డంబరప్రకర్ష
నవ రసానిల చలితమైన చెలి రసన
ధారగా గరిమోహన ధోరణి యగు
చౌదరి యగు వధాన విహార వేళ

## ప్రశంస

డా. యం. పాండురంగారావు, M.A.Ph.D.
ఆంధ్రోపన్యాసకుడు-హిందూకళాశాల, గుంటూరు.

పరగశతావధానములు పండిత వర్గము తృప్తిచెందగా
తిరుపతి వేంకటేశ్వరులు దివ్యత చేసిరటంచు చెప్పగా
కరమువిశాల భావమున కమ్మగ వింటి మిగాని నేడిటుల్
సరసుడు మేడసాని బహుచక్కగ చేసిన చూచి పొంగమే.

మనమువేసిన ప్రశ్నలే మనకు కొంగి
తములుచూడక మనసుకు తలపురావు
వందమందికి సరియైన పద్యములను
ధారణను చేసి చెప్పు నిన్ తరమె పొగడ

మంజులభావ సంపదలు మాధురిగొల్పు సుశబ్దజాలముల్
రంజితశైలి చందములు రమ్యవికాసములిచ్చు ఛందముల్
కొంజికురాకు కల్పనలు కోమల నవ్య వినోదవల్లరుల్
శింజితగాన వాహినులు చిందును చౌదరి పద్యరాజముల్.

## ప్రశంస

**అష్టావధాని, డా. కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు, M.A.Ph.D.**
ప్రధానకార్యదర్శి, జాతీయ సాహిత్య పరిషత్, ఆంధ్రప్రదేశ్

శ్రీకర మేడసాని కవిశేఖర నీయవధాన శేముషుల్
నాకధునీ తరంగము లనంతదిగంతయశస్సుగంధముల్
వాకలుగట్టు తేనియలు, వన్నెల వెన్నెల పూలపున్నముల్
లోక మనోజ్ఞ భావుక విలోకన పర్వము లుర్వి నెప్పుడున్

షోడశి చూచితి నొకపరి
నేడిచట నీ శతవధాన నిపుణత గంటిన్
వాడని పరిమళములనే
నాడును భవదీయకావ్య నందన మెసగున్

వేడుక లవధానమ్ములు
నాడవి కవితలను ప్రీతి నలవరచె ధరన్
నేడివి సుడివడుబ్రతుకుల
కేడుగడగ నిల్పు ప్రజల నేకాగ్రమతిన్

# సువర్ణాభిషేకము

## యార్లగడ్డ వెంకట సుబ్బారావు

మున్నవధాన పద్ధతికి మూర్తికవీంద్రునుపజ్ఞమూల; మా
తెన్నురసజ్ఞమోహనము; దిద్దిరి తిర్పతివెంకటేశ్వరుల్
మున్నగుశేముషీనిధు లపూర్వవధానవిధానచాతురిం
గ్రొన్ననలాంధ్రభారతికిఁ గూర్చిరి తీర్చిరి దిగ్విదిక్కులన్

భారతవర్షమందుఁగల భాషలె కాదు, ప్రపంచభాషలం
దీరమణీయ సత్కళకు నెవ్వరుఁ బూనర యింతవట్టు; నీ
గౌరవ మాంధ్రజాతికొక గర్వనిదాన నిధాన మాయెఁ ద
ద్వీర వినోదకేళి భవదీయ ముఖంబునఁ బ్రస్తరింపఁగన్

పుట్టుకయెప్పు; డీ భువన మోహనమౌ నవధానదీక్ష చే
పట్టుటయెప్పు; డీ చిఱుతపాయమునందఖిలావధాని స
మ్రాట్టను పట్టభద్రమహిమంగనుటెప్పుడొ; యబ్బురాలకుం
బుట్టవు మేడసానికులభూషణ! ప్రాజ్ఞరసజ్ఞతోషణా!

సూరులు నూఱుమంది నినుఁజుట్టి యలంతలువెట్టుచుండినన్
వీరవినోదపాత్రముగ విక్రమలీలఁ దెరల్చి పుచ్చుచున్
వారిధినాఁ గలంగక సభాసదులం గరఁగించి మించు నీ
ధారణమప్రధృష్య మనితఃపురతః పరతః కృతార్థమున్

పిన్నఁ డితండొకండనుచుఁ బృచ్ఛక సంఘ శతంబునందహో!
యెన్నఁగ నొక్కఁడేని మదినెంచఁడు, డించఁడు కార్ముకంబు, మా
యన్న! దరస్మితాస్పదముఖాబ్జమునం దొకస్వేదబిందువున్
విన్నఁదనంబుఁ బూనకయ విక్రమకేళి యొనర్తు మోహనా!

దురమున ధార్తరాష్ట్రశతదోర్బలధాటి యలంపఁ, దమ్మిమొ
గ్గరమునఁ బార్థసూతికలఁ కంబడెనాఁ; డిట మోహనుండు నూ
ర్వురఁదన వాక్ శిలీముఖ నిరుద్ధులుగా నొనరించి యేచి, యి
క్కరణి నజేయుఁడై నిలిచె గర్తపురీ సమరాంగణంబునన్

వేదవేదాంత వీధులు విస్తరించి
సరససాహిత్య సౌహిత్యగరిమఁబెరసి
సుకృతులకుఁ దోఁచు తామరచూలి మోము మేడ
లేలెడి దొరసాని మేడసాని
శతవధానమహారాజ్యసార్వభౌమ!
భవ్యవినయాభరణ! నీకుభద్రమస్తు!
అతులమేధానిధాన! కళ్యాణమస్తు!
ఆంధ్ర శారదాకార! బ్రహ్మాయురస్తు!

## ప్రశంస

శ్రీ జి. వి. హరనాథ్
విజయవాడ.

అవధాని పదేకృతప్రతిష్ఠః
కవితా రమ్య వధూవిభూషితశ్చ
మెడసాని కులాబ్ధి పూర్ణచంద్రః
జయతి మోహన రమ్యనామధామా॥

కులపతికృత సారధ్యే
గర్తపురీ చలిత శతవధాన సుయజ్ఞే
వాణీ దేవీ కృపయా
కృత తీర్థో జయతి మేడసానివధానీ

శ్రీమద్భూమికుమారి హస్తములలోఁ జెన్నారు తేఁ గెంపులై
రామస్వామి శిరంబుపై నిలచుచో రమ్యంపుఁ గుందమ్ములై
శ్యామంబైన తదీయదేహరుచి నీలానీకమౌ జానకి
రామ స్తుత్త్య వివాహ మౌక్తికము లశ్రాంతంబు నిన్నోముతన్

## ప్రశంస

డా॥ జి.యల్.యన్. శాస్త్రి, గుంటూరు.

ఇనుఁడవు ప్రజ్ఞకు, వటవా
మనుఁడవు వంచగను గర్వమతులను, వాణీ
తనయుఁడ వవధానమ్మున,
ముని యందును మిగులు వేళ మోహన నిన్నున్

అవనిన్-మోహన మేడసాని అవధానాహ్లాద వాగ్ధాటిలో-
వివిధార్థ ప్రతిపాద్యమై, సుగుణసంవిద్భావ విస్తారమై,
లవలీసాధువికాసవృత్తసరసాలంకార సౌవర్ణమై,
ధవళస్వచ్ఛ తటిల్లతాసమచమత్కారప్రభాయుక్తమై,
అవరోధ వ్యవధాన యుగ్మరహిత ప్రారంభసంస్ఫూర్తితో,
రవిబింబైక సితాంశు సప్తముఖ వర్ణస్పష్ట ధీశక్తితో
నవజాతాబ్జసుమ ప్రఫుల్ల పదవిన్యాసోక్త రూపమ్ముతో
భవమై, దర్శనమిచ్చె వాణి, తన-దివ్యంబైన పుణ్యాకృతిన్

అమరుల్, వేంకటశాస్త్రి తిర్పతుల రమ్యంబైన అష్టావధా
నములన్ గుర్తుకు తెచ్చు మోహనుని సన్మానించి మాబోంట్లకున్
స్తిమితానందసుఖమ్ము నిచ్చిన పుర శ్రీనాధపీఠాధిప
ప్రముఖుండైన ప్రసాదరాయ సుకవి స్వామిన్ ప్రశంసించెదన్

## ప్ర శం స

**శ్రీ వి. రామకృష్ణ భాగవతార్**, గుంటూరు.

అంచిత శీలసంపద అహర్నిశమున్ శ్రమియించు బుద్ధియన్
సంచిత పుణ్యపాటవము సచ్చరితంబుగలట్టి మీరు! మీ
మంచితనమ్మె ధార్మికత మర్మవిహీనత కారణమ్ముగా
ఖ్యించి గడించిపెట్టినవి మేటి తనమ్మును మోహనాఖ్యుఁడా!

కవితకు కళ మేడసాని కవితా కళ
మేఘవర్ణశ్యాముడు మేడసాని కవివరుడు
కవిత కలువలరాణి కనుసన్నల నిలిచె
కవితకు రాణి మేడసాని మోహన కవితా వాణి.

మురిసినారలు మిమ్ముగన్న తల్లిదండ్రులు
మురిసినారలు మీ కవితకు కవి వరులు
తెలుగు బిడ్డా! వెలుగు బిడ్డా! పుడమిలో పుణ్యపుబిడ్డా!
మేడసాని మోహన చౌదరి కవి బిడ్డా!

## శ్రీ మేడసాని-పునాదులు-పై అంతస్తులు

**డా. వావిలాల సుబ్బారావు,** అమరావతి.

చిరంజీవి "మేడసాని" సామర్థ్యం ప్రశంసల అవసరానికి అతీతమయింది. అవధాన ప్రక్రియకు అవసరమయిన సామర్థ్యాలలో ఇతను అమేయుడు. బుద్ధి పాదరసం-శక్తిలో విద్యులు, వేగంలో కొండవాగు-తెలుగు లాలిత్యంలోను సంస్కృత ప్రౌఢత్వంలోను సవ్యసాచి. అన్ని రకాల గట్టి పునాదులు ఉన్నాయి.

అవధాన నిర్వహణ మరికొంత చమత్కార వ్యంజితం అయితేనూ-పద్యరచనకు మరికొంత కల్పనాబలం సమకూరితేనూ-హాస్యపుజల్లులు కురిస్తేనూ-ఇంకా రక్తి వస్తుంది. సామాజికులకు ఆసక్తి, ప్రక్రియకు వ్యాప్తి ఇంకా పెరుగుతాయి. జీవితాధ్యయనం పెరిగిన కొద్దీ ఈ గుణాలు గూడ వరించి ఈ మేడకు పై అంతస్తులు లేస్తాయి.

## ప్రశంస

**శ్రీ ఆబ్బరాజు శ్రీనివాసమూర్తి,** గుంటూరు.

మము మెప్పించిన పాండితీ విభవ సామ్రాజ్యాధిపత్యమ్ము, ని
స్సమమై యీధర మీకె చెల్లునని శశ్వత్కీర్తి సంధించు, నీ
యమితాశ్చర్య శతావధాన కవితావ్యాసంగ రాహస్యముల్,
దమ కెట్లబ్బెనొ మేడసాని కులచంద్రా! అబ్బురమ్మయ్యెడున్!

కులపతి నిర్వహణమ్మున
బలికిన నీవాణి! చటుల భాస్వంతమ్మై
వెలిగెను జేజేల్గొని, సొం
పలరగ శ్రీనాథపీఠమందిరమందున్ !

కొప్పరపు సత్కవీశులు,
గప్పురపునుడుల తిరుపతి కవులున్, గవితల్
గుప్పించిన గుంటూరున,
మెప్పుల జేకొంటివయ్య! మేలన బుధులున్.

మోహన వేణునాదరవమో! మృదుమంజుల దివ్యవాక్సుధా
వాహినియేమొ! పల్కుచెలి పల్లవపాణి విలాస లాస్య స
మ్మోహిత దివ్యదర్శనమొ! మోద మొనర్చెగదయ్య మాకు నో
మోహన చౌదరీ! భవదమోఘవధాన విధాన ప్రక్రియల్

అవధానమ్మున కీవు 'మేడ'వు! జనాహ్లాదమ్ము జేకూర్చు నీ
కవనమ్మె 'దొర సాని' నీకు! రసనాగ్రమ్మందు నర్తించు కై
త వినూత్నమ్మగు వేణునాదమయి సంధానించె సత్కీర్తి! వై
భవ మొప్పారగ రాజ్య మేలు కొనుమా! పాండిత్య సమ్మోహనా!

ప్రశంస
"పురుషోత్తమ పుత్రభార్గవ"
శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్

సరస కవిత నిచ్చి చదువుల దొరసాని
మేడసాని వాని మిత్ర సముని
పెద్దవాని చేసి పేరు నిల్పెనుకదా
మోహనముగ జనులు మోద మంద

వలచిన భారతీ మధుర వాగ్రచనా చణుడౌ ప్రసాదరా
ట్కులపతి యీ వధానమును కూరిమి నిర్వహణం బొనర్చె నీ
బలము జవమ్ము చూపితివి వాక్కులలోన శతావధానివై
చెలగుత కీర్తి సంపదలు చేతము ధర్మపథాన నిల్వగా.

## ప్రశంస

***ధనకుధరం సీతారామానుజాచార్యులు***, గుంటూరు.

ఆరయ మేడసాని కులమందు జనించిన మోహనుండు, గుం
టూరు పురాన, నద్భుత మహోజ్జ్వల శేముషితోడ, నెందరో
సూరులు, సత్కవీశ్వరులు చుట్టును పృచ్ఛకులౌచు నుండగా
ధారణ ప్రస్ఫుటింప, నవధానము జేసి, ప్రశంస లందెడున్.

## ఆమోదము

***శ్రీ కొమాండూరు రంగనాథాచార్యులు***, గుంటూరు.

మతి మాన్యుల్ శతపృచ్ఛకావలిత పద్మవ్యూహ బంధాంతర
స్థితి సాహిత్య నవాభిమన్యుగతి నుద్రేకించి, ప్రశ్నావళిన్
జితనం బింతయులేక యాశుకవితా సమ్మోహనాస్త్రంబులన్
వ్యతిరేకించు భవద్విదాంగరిమ నత్యంతంబు శ్లాఘించెదన్.

పదములపోహళింపు, రసబంధుర సుందర భావ వైభవా
స్పదమగు నాశుధోరణి, విపశ్చిత విస్మిత శాస్త్ర పాండితీ
సదమల వాగ్విలాస విలసన్మధురోక్తులు మోహనార్య నె
మ్మదికి ముదంబు గూర్చె నసమాన భవత్కవితా విలాసముల్.

## అభినందనములు

శ్రీమాన్ మాడభూషి నరసింహాచార్యా, గుంటూరు.

మోహను నవధానం బది
మోహన రాగము వలె మము ముగ్ధులఁ జేసెన్
మోహన నీ యాశుకవిత
నాహా యని మెచ్చిరి విబుధావళి యెల్లన్.

చెళ్ళపిళ్ళవారి యల్లికయు తెనాలి
రామకృష్ణ సుకవి రచన సొబగు
కొ్రొప్పు కవుల పద గుంఫన విధమును
సంతరించుకొంటి సత్కవీంద్ర

మేలు మేలన సభికులు మేడసాని
మోహన కవీంద్ర విరజాజి పూలు చల్లి
నట్లు నిర్వహించితివి శతావధాన
మహహ సెహబాసు నీకు చిరాయురస్తు

అంచతత్తడి రౌతు నిల్లాలు నీదు
జిహ్వ నర్తించె లేకున్న శివుని వశమె
యట్టి యవధాన మొనరింప నబ్రమయ్యె
అందుకొను మిదె మా యభినందనములు.

## ప్రశంస

శ్రీ పులిచెర్ల సుబ్బారావు, గుంటూరు.

కవికై యబ్బులు సాఁచి నేఁటి కొదవంగాఁ జూచి వేజుబ్బుఁగాఁ
జవి గొన్నట్టి శతావధాన సుధతో సంతోష సంభ్రాంతమై
"కవనార్థంబుదయించినావు బుధ సంఘాతంబులన్ దన్పినా
వ వురా మోహన చౌదరీ" యనుచు నీ యాంధ్రాళి యుప్పొంగెడిన్.

చేసిరి చెళ్ళపిళ్ళాదులని చెప్పగ విందుముగాని కందుమే
నీ సరిగాఁ గవిత్వసుధ నించి రహించు శతావధానముల్
చేసిన సత్కవీశ్వరుల; చేయు సహస్రవధానమున్ కళా
భాసురఖేలనమ్మున సభాస్థలి మోహనచౌదరీ, యిఁకన్

ఊహల కందని యాహవ
కాహళ పూరించి వేడ్కగావించిన నీ
సాహసమెల్ల బుధుల స
మ్మోహితుల నొనర్చె నౌర మోహన సూరీ!

## ప్ర శం స

**శ్రీమాన్ కోగంటి వీరరాఘవచార్యులు,** ఉప్పలపాడు.

పటుతర కావ్యపాండితియు పద్దెము లల్లెడి నేర్పు, సంస్కృతో
ద్భట గరిమంబు, వాక్యనియతత్వము, దోషములంటకుండ సం
పుటిత మొనర్చు నీ యొడుపు-మోహన! పూర్వమహావధానపుం
బటిమము చాటిచెప్పెడి సభాస్థలి ధారణ ధోరణిన్ దగన్.

అణిమెఱుంగు నాంధ్రమగు నాదట సంస్కృతవాణి స్వర్ణమై
పూనిక కూర్చుహారమన ముచ్చట నీదగు కంఠసీమ నా
వాణి యలంకరింపగ సభల్ మది మెచ్చగ సల్పు మిట్టులే
మానక మేడసాని కులమండన! నీవు శతావధానముల్

## మెచ్చుకోలు

కెప్టెన్ షేక్ మౌలాలీ

మేడసాని సుకవి మిగుల నుత్సాహించి
తా నొనర్చె శతవధాన మిపుడు
పద్యవేగమందు భావంబునందు స
మాస కల్పనమున వాసికెక్కె!

వర్ణనంబు సేయు పద్ధతిలో సమ
స్యలను పూర్తిసేయు సమయమందు
తొట్రుబాటు లేదు తోచును శారదా
దేవి కరుణ ఎంత కలదొ యంచు!

చెలువు మెరయజేసె శ్రీనాథపీఠంబు
బలము గూర్చుచుండె కులపతియును
నిర్వహించినావు నిష్ఠతో శతావధా
నమ్ము బుధులు మెచ్చినారు నిన్ను!

# చిరాయురస్తు

భాషాప్రవీణ
'పాతూరి' అత్రేయ రమణశ్రీ, గుంటూరు.

మనము సహర్షమైనది-అమాంతము గౌగిట జేర్చు పూర్ణ సో
ముని దరి కల్వవోలె, తలపుల్ వివరింపగ గోరినాను-కా
ని, నిముసమేని నేనచట నిల్చుటకున్ సమయం బలభ్య మౌ
టను వివరింపనైతి, ప్రకటంబగు నీ యవధాన సత్క్రియా
గుణ మెటు ముచ్చటింతు? ననుగుంజెలికాడ! లిఖింతునిట్లు; ప్రా
క్తన భవ పుణ్యలబ్ధ 'కవితా దొరసాని' కి మేడ గట్టి, యం
దు నెలవు గూర్చి, యర్చనముతో గురుమంత్ర జపప్రవృత్తి దీ
క్షను గొని, శబ్దదేవత నచంచల భక్తి నుపాసనాప్రయో
జన ఫల సిద్ధి గొన్న దృఢ సంయమనోజ్జ్వల సారచిద్యశో
ధనుడవు, "మేడసాని" కుల తామరసార్క! చిరాయురస్తు; మో
హన! మదుపాస్య దైవము ప్రియమ్ములు గూర్చి సతమ్ము నోముతన్.

## ప్రశంస

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి,** హైదరాబాదు.

తన దేశమ్మున సాగివచ్చు కవితాతత్త్వమ్ము గుర్తించి ప్రా
క్తన సంస్కారము పొంగులెత్తి ననలెత్తన్ కొంగుబంగారమై
ఘన సారస్వత దివ్యమూర్తి జననిన్ కన్నార కీర్తించినన్
ధనమే వాణికి మేడసాని యవధానమ్మింక నాంధ్రావనిన్.

అల శ్రీనాధుని కాలమందు కనెనో ఆంధ్రాళి యీ భాగ్యమున్
ఇల శ్రీనాధుని పీఠదేశమున మే మింపార గుంటూరులో
కలయో మోహన మాయయో యనగ మా కన్నార వీక్షించి తె
ల్గులమై పుట్టిన పుట్టు ధన్యమని పల్కుల్ చిల్క నే పాడెదన్.

## ప్రశంస

**శ్రీ యస్. పూర్ణచంద్రరావు,** గుంటూరు.

**A poet is born : not made** – అని ఓ వాదం వుంది.

కవిత్వం హృదయ సంబంధి: మేధో సంబంధి కాదు-అని
మరొక వాదమూవుంది.

ఇన్నాళ్ళూ నేనెటూ తేల్చుకోలేక పోయాను.

\+ \+ \+

'నిరుపహతి స్థలంబు....' వంటి నియమాలే వుండనక్కర్లేదు.

కవిత్వము, పువ్వైనా, నవ్వైనా

బలవంతాన పూయవేమోనని నా అనుమానం

చిక్కటి పచ్చదనాల మెత్తదనంలోంచి వొయ్యారంగా లేచిన

కన్నెకుసుమం మంచు పరదాల మాటు తొలగించి
వేకువలోకి సిగ్గుగా తొంగి చూసినట్లు—కవిత
స్వచ్ఛంద హృద్యంగా పలకాలి, పలుకుతుంది అని నమ్మాను.

\+ + +

కవిత గజ్జెకట్టి రంగస్థలం మీద వీరవిహారం చేసిన నాడు
నోరు తెరిచి; గుడ్లప్పగించి ఆశ్చర్యపోవడం నా వంతైంది
మేడసాని మోహన్ చేసిన ఆనాటి అద్భుతం
అర్ధశతాబ్దపు చరిత్రను పునరావృత్తంచేసింది—అన్నారు.
ఆ యువకుని ప్రతిభా పాటవాలు అమేయం :
శబ్దం మీది command అమోఘం :
పద్య పూరణ ఆనందదాయకం, ఆశ్చర్యకరం.

\+ + +

రమణీయార్థః ప్రతిపాదకమ్ కావ్యమ్ -
అవును. ఆనాడు రమణీయత కవితా వలువలు ధరించి నర్తించింది.
వేదికపైని వంద తలలు, సభలోని వేల తలలు
శబ్దార్థ సమ్మేళనలో మైమరచి వూగాయి

\+ + +

ఔన్నత్యానికి కొలబద్ద - నేను ఆ పని అలాగ చెయ్యగలనా? అనే ప్రశ్న.
మేడసాని మోహనంగాచేసిన పని
ఏనాడైనా మనలో ఎంత మందిచెయ్యగలరు?

\+ + +

సంస్కృత శబ్దాల తాళింపు ఘాటు మాటున
దాగిన కవితాభావ లాలిత్యం
బహు హృద్యం, పండిత దిగ్దంతుల కరతలామలకం.
మేడసాని వారి కవితావాణి జడనుధరించినది జాజిపూలు :
నడయాడినది రాజహంస వితము :
కూసినది కోకిల కూజితము.

## ప్రశంస

"కవి కులాభరణ"

శ్రీ బండ్లమూడి సత్యనారాయణ, ఏలూరు.

తిరుపతి వేంకటేశకవిధీరవచోమకరందమాని మై
మరచిన తెల్గువాణి నడుమంత్రపు వైద్యుల చేత బడ్డదై
కరము కృశించె; నీ వొసగు క్రమవధాన రసాయనమ్ము నన్
మరల సుఖించి యీ తెలుగు మాన్యములన్ విహరించుగావుతన్!

## ప్రశంస

శ్రీ డి. చంద్రారెడ్డి, విజయవాడ.

వయసున చిన్నయయ్యు తన వాక్పటిమంబున పల్కుపల్కుతే
రయమున మాధురీ మహిమ రంజనమొప్ప బుధుల్ నుతింపగా
జయమును పొందగా మిగుల చక్కని హృద్యములైన పద్యముల్
నియమము తప్పకుండగను నిల్పును మోహను శబ్దజాలముల్

కవితయందు మిన్న కడుచిన్నవయసైన
వన్నెకెక్కె సభల వాడవాడ
పద్య పూరణములు హృద్యములై యుండు
మేడసాని వాని మేధ యెంతొ

కవులు పండితులును కల్పించి యొసగిన
జటిలమైన ప్రశ్నజాలమునకు
క్షణమునందె మేడసాని యొసంగును
తనదు నుత్తరమును తడువుకొనక

# ప్రశంస

శ్రీమతి గుడివాడ ప్రభావతీదేవి, గుంటూరు.

సరస సాహిత్య కళా దీప్తి
శ్రీయుత మోహన మూర్తి
ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలనే
కావ్య హేతువులను ఔపోసన పట్టిన మహర్షి
ధారణ భావన పాండిత్య ప్రకర్షలనే
సాహితీ సమాధి నధిష్ఠించిన యోగ పరమేష్ఠి
కవితా కాంతా హేమ కీర్తి
సరస్వతీ ఉపాసనా మూర్తి
సాహిత్యావధాన చక్రవర్తి
మేడసాని మోహన చౌదరి
మీ
సాహిత్యావధాన యాగంలో
శతావధాన మహాయజ్ఞంలో
పృచ్ఛకు రాలిగా పాల్గొనటం
సురుచిర సుమనోజ్ఞ సువర్ణావకాశం
అతిరథ మహారథులైన కవి పండితుల
వాక్ శర పరంపరలను సుమశరాలుగా స్వీకరించి
మీ అపూర్వ భావనాచక్షువు తో
వీక్షించి, దర్శించి సరస సారస్వత మూర్తిని
సాక్షాత్కరింప చేసిన విధానం
అనితర సాధ్యమైనది
మీ శతావధాన మహాయజ్ఞంలో
పాల్గొనటం ఒక దివ్యానుభవం

## శుభాశంస

శ్రీమతి టి. రాధాబాయి, గుంటూరు.

అవధాన చక్రవర్తీ! మేడసాని మోహన చౌదరీ!
పూర్వమెపుడో జంటకవులట! శతావధానములు చేసినారట!
వినుటయె కాని కన్నులఁగాంచలేదు
నేడు విన్నాము, కనుగొన్నాము, పాల్గొన్నాము
అదియేమి ఆశుధార! అదియేమి కవనము!
పొట్టివాడవెగాని కైత చెప్పుటలో గట్టివాడవు!
ఇంతింతై, వటుడింతయై, మరియు తానంతైనట్లు
ద్విగుణిత, చతుర్గుణిత, షోడశగుణిత అష్టావధానములతో ఎదిగి
శతావధానముతో సాహితీ సామ్రాజ్యమును ఆక్రమించినావు
శ్రీనాధపీఠ కవితా సామ్రాజ్యమది!
కులపతులట పన్నిరి శతావధాన పద్మవ్యూహము
సాహితీ సమరాంగణచక్రవర్తులు పృచ్ఛకులుగ
వదలిరి వారలు శార్దూల, మత్తేభాది క్రూర వృత్త విశిఖములు
కవితావృష్టి చిక్కు సమస్యల ఛేదించి, జయించి
అభిషిక్తుడైనాడవు పండిత ప్రకాండ శుభాక్షతలచే కవితా రాజ్యరమకు
మోదమందినాము నీ అవధాన విజయోత్సవ సభా శ్రీని గాంచి
సాటిలేరు, రారు, మరెవరు నీకు మోహన చౌదరీ!

## ప్రశంస

ప్రజాకవి, శ్రీ చందోలు ఆనందకవి, సత్తెనపల్లి.

భారత పుణ్యక్ష్మాతలి
పేరుందిన తెలుగునాట పెద్దది మనగుం
టూరు, జ్వాల నైషధ, సు
శ్రీరమ నిర్మాతచంద్ర శ్రీనాథ నమో!

అది శతావధాన మహాసభాగ్రపీఠి
కొలువుదీరె ప్రసాద్రాయకులవ తందు
పృచ్ఛకుల పంక్తి నేనొక్క పీఠి నుంటి
భువన విజయంబు తలపున బొటమరించె

అప్పటి కృష్ణరాయలు నిజాకృతికన్నుల గాంచకున్న; నే
నిప్పటి రాయలాభిధుని యీ సభనం దిలకింప శారదాం
బెప్పుడు సత్కవీంద్రుని యభీష్ట మెఱింగి చరించు జిహ్వపై
గొప్ప పదమ్ముల న్విరచి గూర్చును గ్రొత్త గభీరభావమున్

మా ప్రసాదరాయ మంజుల స్వరబాణి
మేడ సాని సభ కమేయ ప్రతిభ
గూర్చె పండితకవి కుంజరములు మెచ్చ
అందులకును మీకిదె హృదయాంజలింతు.

దరులకు బిట్టుగాను ఎగదట్టిన నిర్ఝర వాహినట్లుగం
బరుగులు దీయు మీ మధుర భాషకు సందెడు నా నమస్కృతుల్
సరసులు సత్కవీంద్రుల ప్రశంసల నందిన మేడసాని చౌ
దరికి, ప్రసాదరాయలకు దైవ మొసంగు జిరాయురున్నతుల్

## మే ధా వి ను తి

విద్వాన్ శ్రీ సుఖవాసి మల్లికార్జునరాయశాస్త్రి, తాడికొండ.
Pin : 522 236

వినుత బుధలైన శ్రీనాథపీఠసభల
నల్ల శ్రీనాథుండ యిటీ శతావధాన
మొనరిచెం ద్వదాత్మ నని యెంతుం ఛనితమేధ!
యనఘ మతి! మేడసాని మోహన! సుధీంద్ర!!

'శ్రీనాథ పీఠనేత' న
వీన కవీనుఁడవధాన వీరేంద్రుఁడ! నీ
మానిత శతావధాన వి
ధాన నిధానతఁ జెలంగెఁ దా గర్తపురిన్.

'కులపతి' ముఖ్య కవిబుధేట్
కలితం బవు సభ వధాన కళ నీ లీలన్
వెలయించి, కని తభిష్టవ
ములు జయిపై మేడసాని మోహన! ధీరా!!

ధార సుధాఽఽశి తరంగిణి
ధార నతకరింపఁ, గర ముదారభృశ మసా
ధారణిధారణ దనరఁగఁ,
బూరించి సమస్య లౌర! పొందితి వినుతిన్.

నుతమతులు నీవధానా
ద్భుతంబు నీక్షించి, "భువి నభూతో నభవి
ష్యతి యిట్టి మేధ" యని రిం
పు తలిర్పఁగ, మేడసాని మోహన! సుమతీ!!

ధారణియందు నెంద అవధానులు లేరె? రరయంగ వారు సా
ధారణియైన మేధయు మితంబగు పాండితిగల్గు వారు, నీ
ధోరణి వారికబ్బునె? బుధుల్ నిను నెంతు రనంత నీ యసా
ధారణ ధారణా విభవతన్ గుణచూత వధాన! మోహనా!!

## సాటిలేని మేడసాని

డా॥ జంధ్యాల జయకృష్ణ బాపూజీ, గుంటూరు.

అతని నుడుల నాలించిన అతని నడల తిలకించిన
ఉన్నతమగు వ్యక్తిత్వము ఉత్తమమగు కావ్యత్వము
ఆకారము దాల్చినట్టు లందరకును అనిపించును
సాటిలేని మేటియైన శతవధాని మేడసాని

ఉజ్జ్వలమగు చూపుతోడ ఉదాత్తమగు రూపుతోడ
భవ్యమైన భావనతో నవ్యమైన కామనతో
శ్రావ్యమైన శబ్దముతో స్వచ్ఛమైన హృదయముతో
అద్భుతమౌ ప్రతిభతోడ అల్లగలడు కవిత లతడు.

పూలజల్లు కురిసినట్లు పూరణములు చేయునతడు
తేనెవాగు పొంగినట్లు తెలుగుపలుకు పలుకునతడు
సమోసాలు తిన్నయట్లు సమాసాలు వేయునతడు
ముచ్చటైన కవివర్యుడు ముప్పదేండ్ల మోహనుండు

## ప్రశంస

"అవధాన కళా సరస్వతి" "అవధాని చతురానన"

**శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్,** యం.ఏ.

మద్దెల వరుసల, డమరువు
నిద్దపు గమకముల, మేను నిక్కపొడువగా
నిద్దిర కైత యనంగా
ముద్దగు శ్రీ మేడసాని మోహన కవితల్

## ప్రశంస

**శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు,** గుంటూరు.

ఉభయ భాషల ప్రావీణ్య ముప్పతిల్లు
తావక శతావధానమ్ము తనిపె మమ్ము
అతులధారణ శక్త్యద్భుతావహమ్ము
సాహితీమూర్తి! అవధాన చక్రవర్తి!

అవధానమ్ములఁ బెక్కు చూచితిని ప్రత్యక్షమ్ముగాఁ గాని; నీ
కవితాధార శతావధానమున గంగారంగ దుత్తుంగ భం
గ వితానమ్ములఁ దాండవించి రసవత్కావ్యమ్ముగాఁ బొల్చె భ
వ్య వికాసమ్మెగఁజిమ్మ మోహన కవీంద్రా! మేడసాన్యన్వయా!

పిన్నటనాఁటఁగోలె కనువిందగు నాకు కవిత్వ తత్త్వ సం
పన్నుఁడవై వధానము లపారముగా నొనరించి మించి వి
ద్వన్నుతు లందుకొంటివి గదా! "ఉహులాంధ్రమయ ప్రపంచమం"
దెన్నిక మీఱు మాదృశుల కెంతయు సంతస మో మహా కవీ!

## ప్ర శం స

**డా. సూరం శ్రీనివాసులు,** తాడికొండ.

సారతరార్థభావనల శబ్దనదీనృతిరీతి సత్ప్రభా
స్తార హృదంతరాళ రసధార పరిప్లుతిఁ గల్గఁజేయ గుం
టూరు పురానఁజిత్తము నెటో గొని పోయెను నీ వధాన వి
ద్యారమణీయ వైఖరులు ధన్యము నీ జని మోహనా! కవీ!

## శే ము షీ వి శే ష ప్ర శం స

***శ్రీ అకిరిరాజు వేంకటేశ్వరశర్మ,*** గుంటూరు.

తూర్ణనదీ ప్రవాహరయ దుర్వహ దీర్ఘ సమాసవైఖరీ
కర్ణ రసాయన ప్రథిత క్రమ కవిత్వ మహత్వ చాతురీ
పూర్ణము మేడసానికుల మోహన చౌదరి సత్కవీంద్ర సం
పూర్ణ శతావధాన మిది ముగ్ధుల జేసె సదస్యు లెల్లరన్.

విద్యా భూషణ మేడసాని కవితావీరావధానంబులన్
సద్య స్స్ఫూర్తియు నద్భుతంబగు సమస్యాపూరణ ప్రజ్ఞయూ
హృద్యం బెంతయు నాశు భవ్య కవితా హేలల్ ఝరీ తుల్యముల్
పద్యంబుల్ రసవంతముల్ కడు, వహవ్వా ధారణాశక్తియున్.

ఈతనిలోన గల్గె నెటు లీ యవధాన విధాన శేముషీ
చాతురి, పూర్వ పుణ్యఫల సంగతియా! యిది మంత్రశక్తి సం
జాత విశేషమా! యనుచు సభ్యులు మెచ్చ శతావధానముల్
పూత చరిత్రుడీ ఘనుడు మోహన చౌదరి చేయు గొప్పగా.

వామనుని వోలె నీతడు వామనుండు
అయిన నౌగాక, ఔర! మహాద్భుతముగ
పెరిగి యంతంత కవధాన వేళలందు
ఆ త్రివిక్రము డౌచు పరాక్రమించు

విద్యతోగూడి వినయంబు బెరసియుండె
కవితతోగూడి పాండితి కలిసియుండె
ఆశు వవధాన నైపుణి ననుగమించె
మోహనుం డందుచే సభా మోహనుండు.

## ఆశీస్సుమాలి

శ్రీ వి. సత్యనారాయణశాస్త్రి

మేడసాని ప్రతిభ వాడ వాడల ప్రాకె
చూడనతని కవిత కీడు గలదె
పదము వెదుకబోడు ప్రౌఢ ధారను బల్కు
తడను గామి శతవధాన వాణి

ఎందఱు కలుగరొ కవులై
ఎందఱు అవధానపరులొ ఈ దేశమునన్
అందఱిలో లే బ్రాయుం
డందఱి మెప్పించి యశపుటందల మెక్కెన్

శాంత గభీరుం డాతడు
సొంతముగా నభ్యసించె సారస్వతమున్
శ్రాంతిని జెందడు మాంత్రిక
భ్రాంతిని కల్గించె రసిక పండిత వరులన్

## ప్రశంస

**కె. ఉమాకుమారి**

ఈనాడు శ్రీనాధ పీఠంవారు నిర్వహించిన ఈ శతావధాన ప్రక్రియ, భారతయుద్ధంలోని పద్మవ్యూహాన్ని పోలినట్లు తోచింది. సభారంభంలో ప్రేక్షకులకు దర్శనమిచ్చిన అవధానిగారు పద్మవ్యూహంలో ప్రవేశించిన అభిమన్యునివలె అవధాన ప్రక్రియలో ప్రవేశించిన తరువాత ప్రేక్షకులకు కనుమరుగయ్యారు. ఐతే అవధానిగారు అభిమన్యునివలె గాక చక్కటి భావస్ఫూర్తి, సాహిత్య స్ఫూర్తితో పృచ్ఛకులను ఎదుర్కొని శతావధాన వ్యూహాన్ని ఛేదించుకొని సన్మానసభలో ప్రేక్షకులకు దర్శనమిచ్చారు. ఇంతటి కఠిన వ్యూహాన్ని పన్నిన శ్రీనాధపీఠంవారి నిర్వహణ కొనియాడదగినది. ఈ వ్యూహాన్ని అవలీలగా ఛేదించి జయభేరి మ్రోగించిన శ్రీ మేడసాని మోహన్‌గారి సాహిత్యపటిమ శ్లాఘనీయము. సభావేదిక నలంకరించిన పృచ్ఛకులు వృత్తపరిధి మీది బిందువులుగాను, నిర్వహణాధ్యక్షులు సమస్యలను కేంద్రానికి (అవధానిగారికి) పంపించే వ్యాసార్ధంగాను తోచారు.

శ్రీనాధ పీఠంవారు భవిష్యత్తులో యిటువంటి కార్యక్రమాలను మరెన్నో నిర్వహించి సాహిత్య ప్రియులైన గుంటూరు పురజనులకు ఆనందాన్ని కలిగిస్తారని ఆశిస్తాను.

## ఆ శీ స్సు మా లు

శ్రీ ఖారతుల నరసింహశర్మ

పాటిమీర నాఖు, ఖావ, బంధ, రీతి, శయ్యలన్
ధాటితోడ మేలికై ఽధార ల్లుసిల్లగన్
ఆటగా శతావధాన మాచరించి మించితే
మేటివౌర, నేటికవుల మేడసాని మోహనా!

తలచు నీశక్తి పండిత తతులవెల్ల
పిలచు నీ వ్యక్తి రసికుల పిండు సెల్ల
మలచు నీ రక్తి కవితను మహిత నిరతి
నిలచు నీ కీర్తి నిండుగా నిఖిల జగతి.

ఆంధ్ర, గీర్వాణి నీ వాణి నామతింతు
అచ్చమగు నీయశోగీతి నాలపింతు
అక్షరాక్షతల్ శిరమున నాలిఖింతు
ఆశిషమ్ముల సుమముల నాదరింతు.

## ఆ శీ ర క్షి త లు

విద్వాన్ కుందుర్తి సత్యనారాయణమూర్తి, యం. ఏ.,
విజయవాడ.

శ్రీనాథ పీఠమందిట
జ్ఞానామృతమంది మోహనా! మగసిరితో
'ఈనాడు' శతవధానివి-
నేనం చిలచాటినావు నిర్భేద్యముగన్!!

ధారాళమ్ముగ భూమిపై కడవ పోతన్ బోయు గంగాజలం
బై రాజిల్లుచు మీ కవిత్వఘన విన్యాసమ్ము సత్కావ్యకే
దారక్షేత్రములన్ తనర్చి మృదుమందారాల చందాల నా
ధారంబై కవికోటికిన్ నవరసార్ద్రైకామృత మ్మిచ్చెరా!!

ఈ నగరాన మీకవిత కింపు చిగిర్చి రసాల తర్వులె
న్నోనగిషీల జెక్కిన మనోహరమైన కళావనాలుగా
మానసవీధి మీమధురమంజుల భావములెల్ల సూక్తులై
వీనుల విందుజేసె, నరవిందసుఖాసన! వాణి! సత్కృపన్!

నీ మృదు రసాల భావరసామృతమయ
పల్లవంబుల పూయు ప్రఫుల్లమోహ
నాక్షరము లంతరంగాల హర్షమిడగ
ప్రజకు "కవికోకిల"! కవి సర్దారువైతి!!

మేడసాని మోహనకవీ! మేల్మి శతవ
ధాన సార్వభౌమ! విజయధ్వజమునాటి
చిరతరమ్ముగ వర్ధిల్లు స్థిరత క్షితిని
శ్రీ కనకదుర్గ! శ్రీ కరాశీస్సులంది.!!

## ప్రశంసాశంసనము

శ్రీ జన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి, గుంటూరు

మోహన బాణమట్టుల నమోఘము తన్మయముంబొనర్చు స
మ్మోహము గూర్చు సంతత మపూర్వశరత్సమయేందు కాంతి సం
దోహము లట్లు కాంతల మనోజ్ఞదరస్మితపుంజ మట్టులీ
మోహన మేడసాని కవిపుంగవు రమ్య శతావధానముల్

మొదట ప్రశాంత సాగరము మోమునగన్పడు ప్రశ్నపైచినన్
మెదలు నిరంతరమ్ములు నమేయ సముజ్జ్వలవాఃప్రవాహముల్
కదలును తూర్పు సంభ్రమటు క్రమమహత్తర ఘోషమీఱ స
మ్మదమును మేడసాని కవి మాన్యునియందు మనోజ్ఞ రీతిలో

అమలోత్తుంగ మహాద్రిశేఖర సర ధ్వావర్తమానోచ్ఛల
ద్విమలానేక ఝురీ సమూహకలనా విర్భూతవేగోల్లస
త్సమ గంభావిల దివ్య వాహినియె నా సొంపొందు వాగ్రీతితో
నమరున్ మోహన సత్కవీంద్రు కవితా హంకార హుంకారముల్.

గంగా భంగ తరంగ సంగతుల నిక్కంజూచు వాగ్వైఖరుల్
తుంగాద్రీంద్ర మనోజ్ఞతల్ మిగుల నుద్యోతించు భావమ్ములున్
సంగాతమ్ముగ దా వధానముల నాంధ్రమ్మందు గావించు నీ
రంగద్వ్యాఘ్రరి బ్రోచు వేంకటగిరీంద్రస్వామి సంప్రీతితో

## అభినందన పారిజాతాలు

శ్రీ E. S. K. హరనాథబాబు, గుంటూరు.

మణిగణ బంధిత స్థగిత మాన్య వదాన్య వరేణ్య వైద్య సం
భణితుడు మేడసాని పదభావ విభావరి ఖేలలీల, తత్
క్షణ గత కాలమాత్ర పరికల్పితశిల్పి, అనల్ప కావ్యల
క్షణ యుత హృద్య పద్యనిధి, సాక్షి వధాన విధాన ధారకున్

ధారణ మించి ధారయును ధారను మించిన ఆశుధారయున్
పూరణ మేదిలేక పరిపూర్ణ సువర్ణ సమాస భాసుర
ప్రేరణ కల్గియున్ వివిధరీతుల పాకములన్ సుధల్ తగన్
తోరణ పంక్తి డెందముల దోచెను మోహన మోహనాస్త్రముల్

ఆదరణీయ వాచ్యతతి ఆకృతి దాల్చిన మేడసాని వం
శోదధి పూర్ణచంద్ర! తవ శుద్ధ వధాన కవిత్వ ధార సా
మోదిత సర్వ మిత్రగణ మోద వినోద వచః ప్రసార! ఈ
మేదిని నీ వధాన పరమేశ్వరి మేధల పెంచుగావుతన్

భూచక్రస్థిత పండిత ప్రకర శోభోద్దీప్తమౌ యిప్పురిన్
శ్రీ చక్రార్చిత సిద్ధ భాసురమగున్ శ్రీనాధపీఠస్థలిన్
ఆచక్రాంతము ముంచితేల్చె నవధానాంభోధి నీ మోహనుం
డా చక్రాయుధు డామహేశ్వరుడే పేరానందముం బొందెడున్

చిలుకలచే పలికించిన
పలుకునట! శతావధాన పద్య రసమ్ముల్
చిలికించిరి నీచే కవి
కులపతులు ప్రసాదరాయ కులపతు లిచటన్

## ప్రశంస

డా॥ బి. వి. శారద

అల్లసానిని మరపించి గర్తపురిలో వినిపించిన
మేడసానిపాణి ఔచితీమూర్తియైన విరిబోణియని
మర్యాదకు మరో రూపమని మంచి తనపు మందహాసమని
అనిపించుకున్నది అభినందనలు పొందింది

శతసహస్రావధాని చిరంజీవి మోహన్ మేడసాని
శారదమ్మకు పసివాడు లక్ష్మమ్మకు అయినవాడు
పార్వతమ్మకు అయినాడట స్వయాన తనవాడు
దీర్ఘాయుష్మాన్భవ అని మంగళాక్షతలు అందుకున్నాడు.

## అభినందన

శ్రీమతి యం. వి. సత్యవతి

శ్రీధామ గుంటూరు సీమలో నేడు
సౌధాగ్రమున నిల్చె శతవధానమ్ము
ధీనాథు లలరారు శ్రీనాథపీఠి
శాణోపలమ్మయ్యె శతవధానమ్ము
శ్రీ మేడసాని వంశీయుడు సుకవి
కోమల భావుండు కోవిదవరుడు
మోహన చౌదరి ముద మొప్పజేసె
వ్యూహ సౌందర్యంబు పొలుపొందునటుల
వంద మందికి చెప్పె ప్రశ్నల నెల్ల
సుందరమ్ముగ పద్యశోభనలగూర్చె
వ్యవధాన మించుకయైన లేకుండ
అవధాన మొనరించె నద్భుత రీతి
కులపతి కవిలోక కులపతి తనకు
చెలువైన రక్షగా సిద్ధిని గూర్చ
ఇంత ప్రదర్శన మీ్మరీతి చేసె
ఎంతటివారైన నిచ్చలో మెచ్చ
పృచ్ఛకురాలిగా నేనును నేడు
స్వేచ్ఛాంతరంగాన పలికెద జయము.

## మేడసాని శతవధానలీల

డా. మునుగంటి కృపాచార్యులు, గుంటూరు.

శ్రీమత్సకల సంపన్మేదుర గర్తపుర విరాజమాన శ్రీ వేంకటేశ్వర విజ్ఞానమందిరే-అచలపతి సుతారాధన సముపలబ్ధ సారస్వత మహావైభవ 'ప్రాచ్యవిద్యాపరమేశ్వర' ప్రసాదరాయ కులపతి సాహిత్య సమాకలితే-నానా దిగ్దేశాగత కవి పండితమండలే-అనితఃపుర్వాను భూత మహోన్నత

సన్నివేశే-సదసి; అనేక జన్మోపార్త సుకృత ఫలపరిణామరూప వాగ్దేవతానుగ్రహ లబ్ధాసాధారణ ధోరణీ విజృంభమాణ సుకవితా విభూతి విలసిత-స్వస్తిశ్రీ మేడసాని మోహన కవి కుంజర చిరసముద్దీపిత శతావధాన-బహుమతి నిధాన-సుమధుర గంభీర నిరర్గళాంధ్రాశు కవనధారా-అభినవరసాధారా-అధరీకృత సుధాధారా-సదాధారా-సధీరా-మమ మానసే సుస్థిరాం స్థితిం నితరాంధరతీతి.

## ప్రశంస

శ్రీ గొల్లపూడి ప్రకాశరావు, గుంటూరు.

ఈ శతాబ్ద ప్రారంభంలో గుంటూరులో శతావధానం జరిగిందని విన్నాను. ఈనాటికి మళ్ళీ కనుల పండువుగా కన్నాను. పృచ్ఛకుడుగా పాల్గొనే అవకాశానికి నోచుకున్నాను. సహృదయులంతా ఆనందసాగరంలో మునిగి తేలారు. శ్రీ మోహన చౌదరిగారు శతశతావధానాలు చేసి కీర్తిగాంచాలని కోరుకుంటున్నాను.

## ప్రశంస

శ్రీ వి. వి. భానుమూర్తి, విజయవాడ.

శ్రీ మేడసాని మోహన్‌గారు తమ ప్రజ్ఞాపాటవములను ప్రదర్శించుచు దిగ్విజయము నొనర్చిన నాటి శతావధానం నాకే కాదు, సభ్యులందరికీ కూడా హర్షాతిరేకము కలిగించిందనుటలో అతిశయోక్తి లేదు. వారి ప్రతిభా

వ్యుత్పత్తులు అనంతం. ధారాశుద్ధి అనర్గళం. ధారణాబలం అమోఘం. సమయస్ఫూర్తి సర్వజనాకర్షణీయం. ఈ శతావధాని కవితాశక్తి ఖండ ఖండాంతరాల ఖ్యాతి నార్జించునట్లు ఏడుకొండలస్వామి అనుగ్రహించుగాక.

## ప్రశంస

**డా॥ ఆకురాతి పున్నారావు**, నాగార్జుననగరం.

శ్రీ మేడసాని మోహన్‌గారి శతావధానం చూస్తున్నప్పుడు నాకు "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యా" అన్న కాళిదాసు వాక్యం జ్ఞప్తికి వచ్చింది. ఆ కవితాధార, ఆ సంస్కృత సమాసకల్పన నిపుణిమ, ఆ పదబంధాలు అయత్న సిద్ధంగా వచ్చి ఆయా ఛందస్సులలో బుద్ధిగా ఇమిడిపోవడం చూస్తుంటే ఆ శక్తి అతనికి జన్మాంతరసంస్కారమని తోచింది.

## ప్రశంస

**శ్రీ మల్లాది శ్రీహరిశాస్త్రి**, గుంటూరు.

శ్రీ మేడసానివారు సద్గురు ప్రసాదిత మంత్ర నిరంతర మననలబ్ధ సుకవితా సమారాధకులు. శతావధానచాణక్యులు. వారి ఆశుకవితాధార హిమగిరి నిస్సృతగంగాఝరీ సబ్రహ్మచారిణి. వారిధారణము అసాధారణము. వారి క్లిష్టప్రాసయుత సమస్యాపూరణములు శేముషీపూర్ణములు. వర్ణనలు, దత్తపదులు ప్రథితప్రజ్ఞాప్రకాశకములు. వారి ఏకాగ్రత శతధా అజేయము. భగవంతుడు వారిచే శతాధికముగా శతావధానములు చేయించి సాహితీప్రియుల నలరించుగాక.

## ప్రశంస

*శ్రీ B. మునిరత్నం,* తిరుపతి.

శ్రీనాథ పీఠంవారు నిర్వహించిన చారిత్రాత్మకమైన ఈ శతావధానంలో పాల్గొనటం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. అవధాన చక్రవర్తి మోహన్‌గారి అనన్యధారాధారణాలు, ప్రసాదరాయకులపతి సముచిత సభానిర్వహణం, కార్య నిర్వాహకుల కార్యదీక్ష ఈ సాహితీ యజ్ఞానికి నిండుదనాన్ని సంతరించాయి.

## ప్రశంస

*శ్రీ అంబడిపూడి చంద్రశేఖరశాస్త్రి,* గుంటూరు.

తొలుత నేను విజ్ఞాన మందిరములో చూచినప్పుడు అష్టశతావధానములు చేయుచున్న మోహను డితడేనా అని నాకనుపించినది. వంద మంది పృచ్ఛకులకు సమాధానము లివ్వగలడా అని కూడా అనిపించినది. అట్టి మోహనుడు తన వాక్చాతుర్యముతో కవి పండితులను ఆనంద సాగరములో ముంచి తేల్చుట పృచ్ఛకుడనైన నాకు ఇతడు బ్రహ్మసరస్వతుల మానస పుత్రుడా? అను భ్రమ కలిగించినది.

## ప్రశంస

*శ్రీ నక్కా నాగేశ్వరరావు*

అవధాన ప్రక్రియ ఆంధ్ర సాహితీ జగత్తులో పురాతనమైనదైనా అందునా ప్రత్యేకించి గుంటూరు పట్టణములో రసజ్ఞులకు నూతనోత్తేజం

కలిగించింది. శ్రీ మోహన చౌదరి శతావధానం మణిపురాని అపూర్వ ప్రదర్శనం.

## ప్రశంస

శ్రీ గద్దె బుచ్చయ్య, గుంటూరు.

శ్రీ మేడసాని ధార నన్ను విస్మయపరచింది. ధారణ కూడ అమోఘంగా ఉంది. కాస్త చమత్కారం తక్కువగా ఉన్నా పూరణలు, వర్ణనలు స్ఫూర్తిమంతంగా ఉన్నాయి. శ్రీ మోహన చౌదరి ఇక ముందు అవధానాల్లో రవ్వంతహాస్యం, కించిత్తు సున్నితమైన శృంగారం జోడించి సభాసరస్వతిని రసప్లుతంచేసి హర్షపులకితం చేస్తారని నా ఆశంస.

## ప్రశంస

శ్రీ కత్తా ఈశ్వరరావు, గుంటూరు.

శ్రీ మేడసాని వయసులో చాల చిన్నవాడు. కాని ప్రాచీన సంప్రదాయ గ్రంథములు బహువారములు తఱచి తఱచి చూచినట్లు కనిపిస్తుంది' ఆయన ధారణాశక్తి అత్యద్భుతము. ఏమీ విరామము లేకుండా ప్రతి విషయము జ్ఞప్తియందుంచుకొని రెండు రోజులలో పూర్తిచేసి చెప్పటం చాల మెచ్చుకోతగ్గ విషయం. చాల పద్యములు చక్కని చిక్కని గంభీర పద జాలముతో ఇవి ఆశువులుగా చెప్పినవా ? అన ఆశ్చర్య చకితులను చేసినవి.

# మానసిక ఏకాగ్రత సాధనకు ధ్యానమే ఉత్తమ మార్గం

**అవధాన చక్రవర్తి శ్రీ మేడసాని మోహన్**

(గుంటూరులో జూన్ 27, 28, 29 తేదీలలో శ్రీనాథపీఠం ఆధ్వర్యాన అష్టోత్తర శతావధానం దిగ్విజయంగాచేసి పురజనులను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తిన తిరుపతి వాస్తవ్యులు శ్రీ మేడసాని మోహన్ గారితో "భారతీయ మార్గం" సంపాదకుని ఇష్టాగోష్ఠి)

గిరిధరరావు : నమస్కారం మోహన్‌గారూ! 50 ఏళ్ళ క్రిందట గుంటూరులో వేలూరి శివరామశాస్త్రిగారు శతావధానం చేశారని విన్నాము. ఆ తరువాత అట్టి సాహసం చేసిన మహాకవులెవరూ లేరు. మొన్న మీరు శ్రీ వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో 108 మంది పృచ్ఛకులతో అష్టోత్తర శతావధానం చేసి కవిపండితుల ప్రశంసలు పొందారు. నభూతో నభవిష్యతి అన్నట్లు మీరు చేసిన సాహిత్యయజ్ఞం తెలుగు దేశానికే గర్వకారణం. ఈ సందర్భంగా మీనుండి కొన్ని విషయాలు తెలుసుకొనదలచి వచ్చాను.

మోహన్ : సంతోషం గిరిధరరావుగారూ! విజయవాడలోను, గుంటూరులోను జరిగిన కార్యక్రమాలలో అప్రస్తుత ప్రశంస ద్వారా మీరు నాకు పరిచయమైనారు. మీతో సమయం గడపటం ఆనందదాయకం.

గిరి : మీ శతావధానాన్ని అనేక మంది యువకులు, విద్యార్థులు, సాహిత్యాభిమానులు విన్నారు. మీకుగల ధారణాశక్తికి విస్తుపోయారు. ఒక ప్రవాహంవలె మీ నోటినుండి పద్యాలు వెలువడటం ఆశ్చర్యాన్ని కలిగించింది.... ఆంగ్లంలో ఒక సామెత వున్నది. "నీవు మంచివాడవు కాదలిస్తే ఇతరులలోని మంచితనాన్ని ప్రేమించు" అని. అలాగే మీవలె కవిత్వం చెప్పాలనే కుతూహలం గలవారు చాలా మంది వుండవచ్చు. అలాంటివారి ఉపయోగం కొరకు మీ అభిప్రాయాలను, అనుభవాలను తెలుసుకొని పత్రికా ముఖంగా వెలువరింపదలచినాను.

మోహన్ : మంచిది; ఏదైనా అడగండి.

గిరి : ఈ కవితాశక్తి, భావనాబలము, ధారణశక్తి మీరు ఎలా అలవరచుకున్నారు? వంశపారంపర్యంగా వచ్చినవా?

మోహన్ : మా పూర్వీకులెవరూ కవిత్వం చెప్పలేదు. మా తండ్రి శ్రీ అయన్న నాయుడుగారు వ్యవసాయం చేస్తారు. మాది చంద్రగిరి సమీపంలో కోట గ్రామం. మా తల్లి లక్ష్మమ్మగారు చిన్న తనంలో నాకు భగవద్గీత, పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞానం వినిపించేది. నామనస్సు మీద ఆ రెండింటి ప్రభావం బాగా వున్నది.

గిరి : మరి మీరు ఎవరైన గురుకటాక్షం వలన మహాకవి అయినారా?

మోహన్ : నాకు కవిత్వంలో గురు వంటూ ఎవరూలేరు. ప్రాచీన సాహిత్యంలో రమారమి 25,000 పద్యాలు నోటికి వచ్చు. తెలుగులో ఎఱ్ఱన, శ్రీనాధుడు అంటే నాకు యిష్టం. అలాగే సంస్కృతంలో మయూరుడు నా అభిమాన కవి. అయన వ్రాసిన సూర్యశతకం, ఇంకా ఇతర గ్రంథాలు కంఠస్థంచేశాను.

గిరి : మీకు మానసిక ఏకాగ్రత, ధారణా శక్తి ఎలా అలవడ్డాయో మనవి చేస్తారా!....మీలాంటి వారికి తమను గురించి తాము చెప్పకోవడం ఇష్టం వుండదు. నాకు తెలుసు. అయినను పలువురి ఉపయోగంకొరకు మీరీ విషయాలు చెప్పమని కోరుతున్నాను.

మోహన్ : అలాగే చెపుతాను. నేను 8వ తరగతి చదువుచుండగా శ్రీ శివానందమౌనస్వామి అనేవారు నాకు మంత్రోపదేశం చేశారు. ఆనాటి నుండి ఈనాటి వరకు నియమం తప్పకుండా ప్రతిదినం నియమిత సంఖ్య వరకు మంత్ర జపం చేస్తాను. తద్వారా నాకు ధ్యాన సమయంలో మానసిక ఏకాగ్రత అలవడింది. అంతేగాక, ఇటీవల కాలంలో ధ్యాన సమయంలో వుండే ఏకాగ్రతే రోజులో మిగతా సమయంలో గూడ కొనసాగుతున్నది! అదే నా ధారణా శక్తికి మూల హేతువు.

గిరి : చాల సంతోషం.... ఐతే దీనినిబట్టి మీవలె సాహితీరంగంలో ఉన్నత స్థాయి అందుకొనగోరేవారికి మీసలహా ఏమిటి?

మోహన్ : ప్రతి దినము తన ఇష్టదైవమును ధ్యానించి తద్వారా మానసిక శాంతిని, ఏకాగ్రతను సాధించాలి. దీనితోబాటు ప్రతిదినం "నిన్నటికంటె ఈ రోజు అదనంగా ఏమినేర్చుకున్నాను?" అని ప్రశ్నించుకోవాలి. ఈ రెండుపనులూ అభివృద్ధికి దారి తీస్తాయి.

గిరి : మీ ఉన్నత విద్య ఎక్కడ? ఇపుడు ఏమి చేస్తున్నారు?

మోహన్ : నేను తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ పట్టము పొందాను. మదరాసు విశ్వవిద్యాలయంలో "అన్నమయ భాషావిశేషాలు" గురించి పరిశోధన సల్పి పి. హెచ్. డి. తీసుకున్నాను. ఇపుడు తిరుపతిలో అన్నమాచార్య ప్రాజెక్టునకు కో ఆర్డినేటర్‌గా వున్నాను.

గిరి : ఇపుడు కళాశాలల్లో వ్యావహారిక భాష ప్రవేశపెట్టారుగదా? ఇక వ్యాకరణంయొక్క ప్రాముఖ్యం తగ్గిపోదా?

మోహన్ : 15వ శతాబ్దంనాటి అన్నమయ శాసనాలలో కొన్ని యిపుడు అర్థం కావడంలేదు. ఎందువల్లనంటే అవి ఆనాటి వ్యావహారిక భాషలో వ్రాయబడినవి. వ్యావహారిక భాష ఎపుడూ మారుతూ వుంటుంది. ఈనాటి వ్యావహారిక భాషలో వ్రాసిన వాక్యాలు మరికొద్ది కాలానికి అర్థంకాక పోవచ్చును. అందుచేత భాషకు శాశ్వత ప్రయోజనం చేకూరాలంటే వ్యాకరణం అవసరం.

గిరి : కవికి ఛందస్సు బంధంకాదా?

మోహన్ : అది క్రమశిక్షణతో కూడిన భావప్రకటనకు ఉపకరిస్తుంది. ఒక సన్మానపత్రాన్ని ముద్రించి చేతికిస్తే అది చినిగిపోయి నశించవచ్చు, ఫ్రేముకట్టినట్లయితే అది పాడుకాదు. ఛందస్సు ఆఫ్రేము లాంటిది. అంతేగాక "ధారణ"కు ఛందస్సు సహాయకారి.

గిరి : మొన్న అప్రస్తుత ప్రశంసలో "తొండ ముదిరితే ఊసరవెల్లి అయినట్లు ఎవరుముదిరితే కవి అవుతారు?" అని నేనడుగగా, "తపశ్శాలియగు ఋషి'' ముదిరితే కవి అన్నారు. ఋషికి కవికి సంబంధం ఏమిటి?

మోహన్ : ఋషి మనస్సుపై అధికారం కలిగి వుంటాడు. శుద్ధ మనస్సుతో మలిన మనస్సును జయించుతాడు. అందుచేత ఋషి కవిగా రూపొందితే ఉత్తమ రచన వెలువడగలదు.

గిరి : ఉత్తమ కవిత్వం ఎలా వుండాలి?

మోహన్ : అందమైన కల్పనతో ఒక సందేశాన్ని ఇవ్వడం కవిత్వ లక్షణం.

గి రి : కవిత్వం అతి సామాన్యులకు కూడ అర్థమయేటట్లుగా ఉండా లని ఒక అభిప్రాయం వున్నది. మీరేమంటారు?

మోహన్ : అతి సామాన్యులను అతి సామాన్యులుగానే వుంచరాదు. వాళ్ళను ఎదగనివ్వాలి, వారిలో జిజ్ఞాసను కలిగించాలి.

గి రి : తెలుగు కవికి సంస్కృత పాండిత్యం అవసరమా?

మోహన్ : తెలుగు-సంస్కృతములు మేళవింపు దివ్యమైన వంటకం. పాణిని వ్యాకరణంలో నిగూఢరహస్యాలున్నాయని విదేశాలలో పరి శోధన చేస్తున్నారు.

గి రి : ప్రాచీన సాహిత్యాన్ని పఠించడం అవసరమా?

మోహన్ : ఇందాక నేను చెప్పినట్లు దాన్ని ఋషితుల్యులు వ్రాశారు. దానికి చలనంలేదు. భారతం ఉద్యోగ పర్వంలో ధృతరాష్ట్రునితో విదురుడు "శాంతి" ఎలా లభిస్తుందో ఈ పద్యంలో చెప్పాడు:

"నియత తపమును ఇంద్రియ నిగ్రహంబు
భూరి విద్యయు శాంతికి కారణంబు
వీనికంటెను గూడ మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర"

ఆచంద్రార్కం నిలచే భావపరంపర యిది.

గి రి : పోతులూరి వీరబ్రహ్మంగారి ప్రభావం మీమీద వున్నద న్నారు. ఆయన విశిష్టత ఏమిటి?

మోహన్ : సామాన్య మానవునిలో అద్వైతజిజ్ఞాస రేకెత్తించాలనే తపన ఆయనకున్నది. మానవుడు ఆత్మ పరిశీలన చేసుకోవాలని ఆయన చెప్పాడు. ఆయన ఎలాంటి నియమ నిష్ఠలూ లేకుండా దైవాన్ని ఆరాధించవచ్చు నన్నాడు. మహమ్మదీయులైన కడప, కర్నూలు నవాబులు కూడ ఆయన అనుయాయులైనారు.

గి రి : ధన్యవాదాలు మోహన్‌గారూ! మీ పాండిత్యమేగాక మీ నమ్రత ఎల్లరను ఆకర్షించుచున్నది. సెలవు!

శు భా కాం క్ష ల తో



శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ

షిట్ ట్రాన్స్‌పోర్ట్ ఓనర్స్ & కంట్రాక్టర్స్

రైలుపేట ★ గుంటూరు

శు భా కాం క్ష ల తో



అమరావతి ఛారిటబుల్ ట్రస్టు

గుంటూరు



అధ్యక్షులు

శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి

స్థాపితము : 1932 ఫోన్ : 30230
32090

సహాకాంక్షులతో

# యల్. ఐ. ఆర్. అండ్ సబ్స్క్రిప్
&
# రీడింగ్ రూమ్



అధ్యక్షులు
శ్రీ కొమ్మినేని సీతయ్య

కార్యదర్శులు
శ్రీ గార్నేని స్వరాజ్యరావు
ఆలపాటి రఘునాధరావు